

**PURAANAKATHALU**
by Bejjanki Jagannadhacharyulu

ప్రపంచీకరణ నేపథ్యంలో ఆంగ్ల భాషావ్యామోహం ప్రబలుతోంది. దానివి తగ్గట్టుగా పాఠశాల విద్యలోను పెనుమార్పులు చోటుచేసుకున్నాయి. సంప్రదాయ సాహిత్యం బాల బాలికలకు దూరమైపోతోంది. రామాయణ భారతాలంటే తెలియని పరిస్థితి నెలకొంది. దానికితోడు చిన్ని తెర చిద్విలాసాలు, సంస్కృతి సంప్రదాయాలకు గొడ్డలిపెట్టు.

మన సంస్కృతి సంప్రదాయాలు గ్రంథాలకు పలితము, శిల్ప సంపదలో కొలువుదీరింది. నిజజీవితంలో కనిపించటంలేదు ఇట్టి తరుణంలో బాలబాలికలకు పురాణపురుషులను, వారి చరిత్రను, వారి వ్యక్తిత్వాలను తెలియజేయాలి. ఆ అవసరం గూడాను, బాలల మనసులో పురాణపురుషుల ఆదర్శభావలకు, వారి కర్త్య నిష్టను, నిబద్ధతను తెలియజేయాలి. అటువంటి కథలు పిల్లలు చదవాలి. అప్పుడే పిల్లల్లో వ్యక్తిత్వ వికాసం పెంపొందుతుంది. పురాణ పురుషులను ఆదర్శంగా తీసుకోగలుగుతారు. సరైన మూర్తిమత్వాన్ని రూపొందించుకుంటారు.

బాలల్లో వ్యవైత్వ వికాసం కల్గి సరైన మూర్తిమత్వం రూపొందించుటకు ఇటువంటి రచనలు చదవటంమెంతో అవసరం.

# పురాణ కథలు

---

# పురాణ కథలు



## బెజ్జంకి జగన్నాథాచార్యులు

# పురాణ కథలు



రచయిత :

**బెజ్జంకి జగన్నాథాచార్యులు**





జనహిత ప్రచురణలు

2-172/1,సిండికేట్ బ్యాంక్‌కాలని,కరెన్సీనగర్,రామవరప్పాడు,

విజయవాడ-520 008. సెల్: 92900 83348.

# PURANA KATHALU

Written by :


***Bejjanki Jagannadhacharyulu***

**Address :**
H.No: 12-2-4, Near Srinivasa Mahal,
Macharla, Guntur - 522 426.
Ph : 08642-222904. Cell : 9848562726.


OFFER PRICE
Rs: 25/-


Composed, Designed & Printed :
**JANAHITHA** D.T.P. & Graphics,
Vijayawada.

Cover Page Designed by :
Pratap Puli, Rajahmundry. Cell: 9966688870





Published by




**JANAHITA PRACHURANALU**
H.No : 2-172/1, Syndicate Bank Colony,
Currency Nagar, Ramavarappadu,
Vijayawada - 520 008.






## రచయిత పరిచయం:

**పేరు** :- బెజ్జంకి జగన్నాథాచార్యులు

**విద్యార్హతలు** :- "భాషాప్రవీణ" పండిత శిక్షణ

**పుట్టినతేదీ** :- 20-12-1952

**పితృదేవులు** :- బెజ్జంకి కుమారస్వామి

**మాతృమూర్తి** :- అమృతమ్మ

**జన్మస్థలం** :- వేమవరం- భట్టిప్రోలు (మం), గుంటూరు జిల్లా

**పాఠశాలవిద్య** :- వేమవరం, సూరేపల్లి

**కళాశాలవిద్య** :- శ్రీ శంకర సంస్కృత కళాశాల, రేపల్లె.
ఆంధ్రాయూనివర్సిటీనుండి ఎం.ఎ (తెలుగు)
మధుర కామరాజ్ యూనివర్సిటీ నుండి ఎం.ఫిల్
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుండి
"గుంటూరుజిల్లా కవుల ఆధునిక గేయ కావ్యాలు" సాహిత్య పరిశోధన.

**వృత్తి** :- ఉపాధ్యాయ

**చిరునామా** :- తెలుగు పండితులు, జిల్లా పరిషత్ బాలుర ఉన్నత

పాఠశాల, మాచర్ల గుంటూరు జిల్లా 522426.

**ఇంటి చిరునామా:-** 12-2-4, శ్రీనివాస మహల్ వద్ద, మాచర్ల.

**ఫోన్ :-** 08642-222904, సెల్: 9490846448

**రచనలు :-** సర్వశిక్షా అభియాన్ (రాజీవ్ విద్యా మిషన్‌కు ) అందించినవి

1. పల్నాటి కవులు, రచయితలు
2. పల్నాటి స్వాతంత్ర్య సమరయోధులు
3. నాగార్జున సాగర్ చరిత్ర
4. పోకూరి కాశీపతి జీవిత చరిత్ర
5. కన్నెగంటి హనుమంతు జీవిత చరిత్ర
6. గుర్రం మల్లయ్య జీవిత చరిత్ర

**ముద్రితములు:-** 1. తెలుగు ధీర నీతిశతకము

2. పల్నాటి వైభవము (క్విజ్ బుక్)

**అముద్రితములు :-** 1. గుంటూరు జిల్లా స్థానిక చరిత్రలు

2. గుంటూరు జిల్లా పర్యాటక ప్రాంతాలు

**సంపాదకులు :-** బాల సాహిత్య ప్రచురణలు, సర్వశిక్షా అభియాన్, గుంటూరు

**పురస్కారాలు :-** 1. ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారం-ప్రాథమిక విద్యాభివృద్ధి సేవాసంఘం, వేమూరు-2000 సం॥.

2. జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు-2008 సం॥.



# ❖❖ విషయసూచిక ❖❖










యశోదకు పుట్టిన శిశువును యోగమాయ అంటారు. యోగమాయను వసుదేవుడు తీసుకున్నాడు. తిరిగి వచ్చి దేవకి ప్రక్కన పడుకోబెట్టాడు. చెరసాల తలుపులు పూర్వం లాగ వేసుకున్నాయి. తెల్లవారింది, కంసుడు వచ్చాడు. దేవకి ప్రక్కన శిశువును చూశాడు. దేవకి ఎంత బ్రతిమలాడినా వినలేదు. చంపటానికి పైకి ఎగురవేశాడు. కత్తి తీశాడు. యోగమాయ ఆకాశంలో కలిసిపోయింది. కంసా! దేవకీదేవి అష్టమ గర్భంతో నీకు చావు తప్పదు. ఆ పిల్లవాడు వ్రేపల్లెలో పెరుగుతున్నాడు. అని చెప్పి మాయమైంది.

వ్రేపల్లెలో యశోద దగ్గర ఉన్నవాడే శ్రీకృష్ణుడు. దేవకి అష్టమ గర్భంలో పుట్టాడు. అష్టమి రోజున పుట్టాడు. అందుకని మనం శ్రీకృష్ణుడు పుట్టిన రోజున "కృష్ణాష్టమి" పండగ చేసుకొంటున్నాము.

యశోద అల్లారుముద్దుగా శ్రీకృష్ణుని పెంచుతోంది. కంసుడు శ్రీకృష్ణుని చంపటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. మాయ వేషంలో రాక్షసులను పంపాడు. వారందరినీ శ్రీకృష్ణుడు చంపేశాడు.

బాలకృష్ణుని చంపమని కంసుడు 'పూతన' అను రాక్షసిని పంపాడు. పూతన విషం పాలు ఇచ్చింది. పాలు త్రాగుతూ రాక్షసి ప్రాణాలు తీశాడు బాలకృష్ణుడు. సుడిగాలిలా వచ్చిన తృణావర్తుడను రాక్షసుని చంపేశాడు.

గోపికలతో, గోపబాలురతో బాలకృష్ణుడు అల్లరి పనులు ఎన్నో చేశాడు. అన్న బలరామునితో స్నేహితుడు కుచేలునితో చదువుకున్నాడు. వీరి గురువు సాందీపుడు.

కాళియమర్దనం చేశాడు. కాళియుడు అను రాక్షసుడు మహాసర్పమైవచ్చాడు. వాడి తలమీద నాట్యంచేసి చంపేశాడు. గోవర్థన పర్వతాన్ని చిటికెన వ్రేలితో ఎత్తాడు. గోవులను, గోపాలురను రక్షించాడు. ఒకటేమిటి ఇలా ఎన్నో మహిమలు చూపాడు బాలకృష్ణుడు.



# 2 సత్యభామ

శ్రీకృష్ణుని ముద్దుల మూడో భార్య సత్యభామ. సత్రాజిత్తు కుమార్తె. సత్రాజిత్తు నదీ స్నానం చేస్తూ బాల భాస్కరుని స్తోత్రం చేస్తాడు. సూర్యుడు సత్రాజిత్తు భక్తికి మెచ్చాడు. ప్రత్యక్షమైనాడు. "శమంతకమణి" ని ఇస్తాడు.

"శమంతక మణి"ని తనకిమ్మని శ్రీకృష్ణుడు అడిగాడు. సత్రాజిత్తు ఇవ్వనన్నాడు. సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు. ఒకనాడు ఏంజరిగిందంటే! ప్రసేనుడు "శమంతక మణి హారం" ధరించి వేటకు వెళ్లాడు. సింహాన్ని వేటాడబోయినాడు. సింహం ప్రసేనుడిని చంపేస్తుంది. శమంతకమణి వింత. కాంతులు వెదజల్లుతోంది. సింహం దానిని నోట కరుచుకొనిపోతోంది. జాంబవంతుడు సింహాన్ని చూశాడు. ఆ సింహాన్ని చంపి, శమంతక మణిహారాన్ని తీసుకుపోయి కూతురు జాంబవతి మంచానికి తగిలిస్తాడు.



ఇది ఇలా వుండగా... శమంతక మణి కోసం శ్రీకృష్ణుడు ప్రసేనుడిని చంపాడని పుకారు పుట్టింది. ఆ అపవాదు తొలగించుకోవాలనుకున్నాడు శ్రీకృష్ణుడు. మణి ఎక్కడుందో తెలుసుకున్నాడు. జాంబవంతుని ఓడించి మణిని తెచ్చి సత్రాజిత్తుకు ఇస్తాడు.

సత్రాజిత్తు సంతోషిస్తాడు. తన తప్పును తెలుసుకున్నారు. శ్రీకృష్ణుని పై అభాండం వేసినందుకు బాధపడ్డాడు. కూతురు సత్యభామను ఇచ్చి వివాహం చేసి శమంతక మణిని కూడా కృష్ణునకు ఇచ్చాడు. శ్రీకృష్ణుడు శమంతకమణిని తిరిగి సత్రాజిత్తుకే ఇచ్చేస్తాడు. ఇలా సత్యభామ శ్రీకృష్ణుని భార్య అయింది.

సత్యభామ శ్రీకృష్ణుని ఎంతగానే ప్రేమిస్తుంది. శ్రీకృష్ణుడు తనకే సొంతం కావాలనే పిచ్చి ప్రేమ. సత్యభామకు యుద్ధవిద్యలు కూడా వచ్చు. నరకాసురుడు మానవులను, దేవతలను హింసించుచున్నాడు. దేవతలు మొరపెట్టుకున్నారు. శ్రీకృష్ణుడు సత్యభామతో యుద్ధానికి వెళ్ళాడు. యుద్ధం ఘోరంగా జరుగుతోంది. నరకాసురుని బాణఘాతానికి శ్రీకృష్ణుడు మూర్ఛిల్లినాడు. వెంటనే సత్యభామ విల్లంబులు అందుకుంది. నరకాసురునితో యుద్ధం చేసింది. సత్యభామ చేతిలో నరకాసురుడు చచ్చాడు.

నరకుడు చచ్చిన రోజునే మనం నరక చతుర్దశి అంటాం. ఆ తరువాత దీపావళి పండుగ చేసుకుంటాము. ప్రజలంతా ఆనందోత్సాహాలతో జీవిస్తున్నారు.

సత్యభామకు శ్రీకృష్ణునకు కలిగిన సంతానంలో తామ్రుడు, చక్రుడు అను వారు ఇద్దరు ప్రసిద్ధులు.



# 3 రుక్మిణి

శ్రీకృష్ణుని పెద్దభార్య రుక్మిణి. ఈమె సాధుశీల. భక్తి ప్రపత్తులు కలిగినది. గుణవతి, వినయశీల. "కుండీన" నగర రాజు భీష్మకుని కూతురు. ఈమెకు రుక్మి, రుక్మధరుడు, రుక్మబాహువు అను ముగ్గురు సోదరులు కలరు. రుక్మి పెద్దఅన్నయ్య.

ఒకనాడు పెద్దఅన్న రుక్మి ఈమెను శిశుపాలునకు ఇచ్చి పెండ్లి చేయాలని నిశ్చయించాడు. కాని, రుక్మిణి శ్రీకృష్ణుని గుణగణములను మెచ్చి ప్రేమించింది. తండ్రి స్వయంవరం ప్రకటించాడు. ప్రేమించినవాడు వస్తాడో రాడోనని భయంవేసింది రుక్మిణికి. ఒక లేఖ వ్రాసి విప్రునకు ఇచ్చి శ్రీకృష్ణునకు ఇమ్మని పంపించింది.



లేఖ అందుకున్న శ్రీకృష్ణుడు వచ్చాడు. రాక్షస వివాహం చేసుకోదలచాడు. రుక్మిణిని రథం ఎక్కించుకుని పోతున్నాడు. అది గమనించిన రుక్మి వెంబడించి కృష్ణుని అడ్డుకున్నాడు. రుక్మికి, శ్రీకృష్ణునికి యుద్ధం జరిగింది. రుక్మి ఓడిపోయాడు. శ్రీకృష్ణుడు చంపబోయాడు. రుక్మిణి, అన్నను కాపాడమని వేడుకుంది. రుక్మిణి ప్రార్థన మన్నించాడు శ్రీకృష్ణుడు. జుట్టు, మీసం గొరిగించి వదిలిపెట్టాడు. శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహమాడాడు.

శ్రీకృష్ణుని మూడో భార్య సత్యభామ వ్రతం చేసింది. వ్రతం పూర్తి అయింది. ఆ వ్రతం ప్రకారం కృష్ణుని తులాభారం పెట్టింది. ఆమె ఎన్ని ఆభరణాలు వేసినా కృష్ణుని సరి కాలేదు. ఆశ్చర్యపోయింది. ఏమి చేయాలో తోచలేదు. అప్పుడు శ్రీకృష్ణుడు సత్యభామను వీడి నారదుడి వశం అయిపోతాడు. అప్పుడు

రుక్మిణి విషయం తెలుసుకొని వచ్చింది. శ్రీకృష్ణుడని ప్రార్థించింది. తులసీదళం వేసింది. తులాభారం తూగింది. సత్యభామ గర్వభంగం అయింది. ఈ విధంగా రుక్మిణి తన భక్తి ప్రపత్తులను చాటుకుంది. రుక్మిణి భక్తి అంత గొప్పది.

రుక్మిణీ శ్రీకృష్ణులకు పదిమంది కుమారులు. 1. ప్రద్యుమ్నుడు, 2. చారుదేష్ణుడు, 3. చారుభద్రుడు, 4. సుధేష్ణుడు, 5. సుచారుడు, 6. చారుదేహుడు, 7. చారుగుప్తుడు, 8. చారు చంద్రుడు, 9. విచారుడు, 10. చారువు.

# 4 జాంబవతి

శ్రీకృష్ణుని రెండో భార్య జాంబవతి. ఈమె జాంబవంతుని కూతురు. జాంబవంతుడు మహా బలశాలి. చాలాకాలం జీవించాడు. ఒకనాడు జాంబవంతుడు వేటకు వెళ్ళాడు. అక్కడ సింహం మెడలో "శమంతకమణి"హారం ఉంటే చూశాడు. సింహాన్ని వేటాడి చంపాడు. ఆ శమంతక మణిహారం తెచ్చి తనకుమార్తె జాంబవతి పందిరి మంచానికి తగిలించాడు.

ఈ శమంతకమణి సత్రాజిత్తు సోదరుడు ప్రసేనుడి వద్ద ఉంది. శ్రీకృష్ణుడు శమంతకమణిని ఇమ్మని ప్రసేనుడిని అడిగాడు. ప్రసేనుడు ఇవ్వనన్నాడు. ప్రసేనుడు ఆ మణిహారం వేసుకొని వేటకు వెళ్ళాడు. సింహం బారినపడి మరణిస్తాడు. శమంతకమణి కోసం శ్రీకృష్ణుడే ప్రసేనుడిని చంపాడని పుకారుపుట్టింది. ఈ అపనిందలు తొలగించుకోవాలని అనుకున్నాడు శ్రీకృష్ణుడు. జరిగిన విషయం తెలుసుకున్నాడు. శ్రీకృష్ణుడు జాంబవంతుని వద్దకు వెళ్ళాడు. మంచానికి తగిలించిన మణిహారం







తీసుకున్నాడు. జాంబవంతుడు ఎదురుతిరిగాడు. జాంబవంతునికి శ్రీకృష్ణునికి భయంకరంగా ముష్టియుద్ధం జరిగింది. జాంబవంతుడు మహా బలశాలి. శ్రీకృష్ణుని ధైర్యంగా ఎదుర్కొన్నాడు. పోరు దీటుగా సాగుతోంది. ఎవరూ వెనుకంజ వేయడం లేదు.

శ్రీకృష్ణుడు విష్ణు అంశ సంభూతుడని జాంబవంతుడు తెలుసుకున్నాడు. పోరు మంచిది కాదని తెలుసుకున్నాడు. శ్రీకృష్ణుని వేడుకున్నాడు. పోరు విరమించాడు. శమంతక మణిని తీసుకోమన్నాడు. తన కూతురు జాంబవతినికూడా ఇచ్చి వివాహం చేశాడు. ఈ విధంగా జాంబవతి కృష్ణుని భార్య అయింది.

ఆ శమంతకమణి తీసుకుని వెళ్ళి శ్రీకృష్ణుడు సత్రాజిత్తుకు ఇస్తాడు. సంతోషించిన సత్రాజిత్తు తన కూతురు సత్యభామను ఇచ్చి వివాహం చేస్తాడు. ఆ శమంతకమణిని తిరిగి సత్రాజిత్తుకు ఇచ్చివేస్తాడు. శ్రీకృష్ణుని పై వచ్చిన నీలాపనింద తొలగిపోతుంది.

జాంబవతికి, శ్రీకృష్ణునకు "సాంబుడు" జన్మించాడు.

## ౬ శిబి చక్రవర్తి

ఉశీనర దేశాధిపతి శిబి. ఇతని తల్లి 'మాధవి'. తండ్రి 'ఉశీనరుడు' ధర్మపాలనం చేశాడు. ప్రజలు సుఖజీవనం చేశారు. ఆడిన మాట తప్పడు. శరణు జొచ్చిన వారిని రక్షంచటంలో వెనకడుగు వేయడు.

శిబి శరణాగత రక్షణుడు, ఆర్తత్రాణ పరాయణుడు. అని దశదిశల కీర్తిని పొందినాడు. శిబి కీర్తిని దేవలోకంలో చర్చించుకుంటున్నారు. శిబిని పరీక్షించడానికి ఇంద్రుడు, అగ్నిదేవుడు అనుకున్నారు. అనుకున్నదే తడవుగా తమ రూపాలు మార్చుకున్నారు. ఇంద్రుడు డేగరూపంలో. అగ్ని పావురం రూపంలో శిబిని పరీకించదలచారు.







శిబి యజ్ఞశాలలో ఉన్నాడు. అదే సమయంలో పావురాన్ని డేగ తరుముతోంది. పావురం వచ్చి శిబి చక్రవర్తి భుజంమీద వాలింది. తరుముతూ వచ్చిన డేగ లోవలకు వచ్చింది.

"రాజా! నీభుజం మీద వాలిన పావురం నాది. దానిని విడిచి పెట్టు" అంది. "అది నన్ను శరణు గోరి వచ్చింది దానిని విడువను" అన్నాడు రాజు. "నేను ఆహారం కోసం తరుముకుంటూ వస్తున్నాను. అది నీ భుజం మీద వాలింది. అది నాది. నా నోటి వద్ద ఆహారం తీయడం నీకు ధర్మంకాదు." అంది డేగ. "ఓసి ఇంతేనా? నీకు కావలసినంత ఆహారం ఇస్తానన్నాడు శిబి. "నేను కోరుకున్న ఆహారం కావాలి, నీవు ఇచ్చేది నాకెందుకు" అన్నది డేగ. శరణాగత రక్షణం నాధర్మం, నేను విడువను అన్నాడు శిబి. డేగ, శిబి ఇద్దరి మధ్య ఎంతో సేపు వాదోపవాదాలు సాగినాయి. చివరకు డేగ, అయితే నీవు ఆ పావురం అంత మాంసం నీ శరీరం నుంచి ఇవ్వు అంది డేగ. ఓస్ ఇంతేనా అన్నాడు శిబి.

తక్కెట తెప్పించాడు శిబి యజ్ఞశాలలో తక్కెట కట్టారు. ఒకవైపు పావురాన్ని పెట్టారు. మరోవైపు తొడమాంసం కోసివేశాడు. తూగలేదు. మరికొంత వేశాడు. పావురం బరువు సమానం కావడంలేదు. శరీరంలో అన్నిభాగాలు కోసివేశాడు. సరితూగలేదు. తుదకు తానే తక్కెట కూర్చున్నాడు శిబి. కాటా సరితూగింది. పావురాన్ని రక్షించడానికి శిబి తన ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. వెంటనే డేగ, పావురం రెండూ మాయమైనాయి. ఇంద్రుడు, అగ్నిదేవుడు ప్రత్యక్షమైనారు. శిబి చక్రవర్తిని మెచ్చుకొన్నారు. పూర్వరూపం ఇచ్చారు. మోక్షం ఇచ్చారు. శిబి దేవలోకం చేరుకున్నాడు. ముక్తిని పొందాడు.

## 7 దధీచి

దధీచి మహాముని. తపోబలం కలవాడు. చ్యవన మహర్షి కుమారుడు. దధీచి భార్య లోపాముద్ర. సహధర్మచారిణి, మహా తపస్విని.

రాక్షసులు దేవతలను హింసలు పెడుతూ ఉంటారు. వారిమధ్య దాయాదుల పోరు, ఎప్పుడూ సాగుతూ ఉంటుంది. దేవతల అస్త్రాలను రాక్షసులు అపహరిస్తున్నారు. అందుకని అస్త్రాలను దధీచికి ఇచ్చి కాపాడమన్నారు. దధీచి వద్ద అస్త్రాలు దాచారు గదా, హాయిగా భోగాలు అనుభవిస్తున్నారు. తిరిగి అస్త్రాలు ఎంతకాలానికీ తీసుకోవడం లేదు. దేవతలు అస్త్రాలు ఎంత కాలానికీ తీసుకొనక పోయేసరికి దధీచి మంత్రించి తన కడుపులో దాచిపెట్టాడు. అవి అన్నీ దధీచి ఎముకలలో దాగి ఉన్నాయి. కొంతకాలం తరువాత దేవతలకు, రాక్షసులకు యుద్ధం వచ్చింది. దేవతలు దధీచి వద్దకు అస్త్రాల కోసం దధీచి వద్దకు వచ్చారు. ఇంకేముంది అస్త్రాలు లేవు. మా అస్త్రాలు మాకు కావాలి ఇవ్వమన్నారు దేవతలు. మీ అస్త్రాలు మంత్రించి తాగినాను అవినా ఎముకలకు అతుక్కొని ఉన్నాయి నన్ను చంపి తీసుకోమన్నాడు దధీచి. నిన్ను చంపి పాపం మూటగట్టుకోము. రాక్షసుల బారినుండి నువ్వే మమ్ము కాపాడు అన్నారు దేవతలు. అపుడు చేసేది లేక దధీచి తన తపశ్శక్తి చే తన శరీరాన్ని దహించుకున్నాడు. ఎముకలు మాత్రం మిగిలాయి. ఆ ఎముకలతో దేవతలు అస్త్రాలు తయారు చేసుకున్నారు. రాక్షసులను ఎదిరించారు.



దధీచి మహాముని దేవతలకోసం తన శరీరంలోని ఎముకలనే ఆయుధాలుగా ఇచ్చాడు. ఆచంద్ర తారార్కం కీర్తి గాంచాడు.



## 8 బలిచక్రవర్తి

బలి రాక్షసుల రాజు. మహా బలశాలి. ధైర్యవంతుడు. యుద్ధవిద్యలు తెలుసుకున్నవాడు. నీతి మంతుడు. ఆడిన మాట తప్పనివాడు. తపో నిష్ఠాగరిష్ఠుడు. సద్ధర్మాచరణుడు. విరోచనుని కుమారుడు బలి.

ఒకనాడు బలిచక్రవర్తి ఇంద్రునిపై దండెత్తబోయినాడు. ఇంద్రుడు దేవేంద్రపదవిని వదిలి పారిపోయాడు. మూడు లోకాలను బలిచక్రవర్తియే పాలిస్తున్నాడు.

దేవతలకు రాక్షసుల వల్ల బాధలు అధికమైనాయి. దేవతలు బ్రహ్మకు మొరపెట్టుకున్నారు. బ్రహ్మ విష్ణుమూర్తి వద్దకు వెళ్ళమన్నాడు. దేవతలు విష్ణుమూర్తిని వేడుకున్నారు. సరేనన్నాడు.



బలిచక్రవర్తి యజ్ఞం చేసే సమయంలో "వామనుడై" విష్ణుమూర్తి వచ్చాడు. బలిని మూడు అడుగుల దానం ఇమ్మన్నాడు. అంతేనా! రాజ్యాలు, ఆభరణాలు, మణులు, మాణిక్యాలు కోరుకో ఇస్తాను. నాకేం కొదవ లేదు అన్నాడు బలి. బ్రహ్మచారిని నాకెందుకు, భోగభాగ్యాలు వద్దు. మూడు అడుగుల భూమి చాలు అన్నాడు వామనుడు.

దానవుల గురువు శుక్రాచార్యుడు ఇది గమనించాడు. వచ్చింది విష్ణుమూర్తి అని తెలుసుకున్నాడు. దానం ఇవ్వవద్దు ఇందులో మోసం ఉంది అన్నాడు శు



చెవులకు ఉన్న కుండలాలు ఇచ్చాడు. అంతటి త్యాగం చేశాడు కనుక కర్ణుడు దాన కర్ణుడు అయినాడు. కౌరవుల పక్షంలో ఉంటాడు. పాండవులు సోదరులని తెలిసినా దుర్యోధనునకు ద్రోహం చేయలేదు. దుర్యోధనునికై అర్జునునితో పోరాడి ప్రాణాలు అర్పిస్తాడు. వీర మరణం పొందుతాడు.

యుద్ధం జరిగే సమయంలో రాత్రిపూట తల్లి కుంతీదేవి స్వయంగా కర్ణుని వద్దకు వస్తుంది. పాండవులవైపు రమ్మంటుంది. స్వామి ద్రోహం చెయ్యనంటాడు. తల్లి అడిగినందుకు నీ కుమారులను యుద్ధంలో సంహరించను అని మాట ఇస్తాడు కర్ణుడు.

యుగ యుగాలుగా దానకర్ణుడు అని కీర్తింపబడుచున్నాడు.



# 10 నలుడు

వీరసేనుని పుత్రుడు నలుడు. నిషద దేశమునకు రాజు. ఒకరోజు నలుడు వనములో తిరుగుతున్న సమయంలో ఒక హంస దొరికింది. నీ మనసు కోరిన సుందరి నిన్ను వరించేటట్లు చేస్తాను, నన్ను వదిలిపెట్టు అంది హంస. విడిచి పెట్టాడు నలుడు.

నలుని ఊహాసుందరి దమయంతి. ఆమె వద్దకు వెళ్ళింది. దమయంతి చేతికి చిక్కింది హంస. నలుని గుణ, స్వభావాలను వర్ణించి చెప్పింది. నలునిపై మనసు పడేటట్టు చేసింది. స్వయంవరం ప్రకటించాడు దమయంతి తండ్రి.

నలుడు స్వయం వరానికి బయలు దేరాడు. దేవతలు వచ్చి నలుని సహాయం అడిగారు. సరేనన్నాడు నలుడు. దమయంతి వద్దకు వెళ్ళి మా ప్రేమ వ్యవహారం చెప్పు అన్నారు. అన్నమాటకు కట్టుబడిన నలుడు అదృశ్యరూపంలో అంతఃపురానికి వెళ్ళాడు. దమయంతికి విషయం చెప్పాడు. దమయంతి అంగీకరించలేదు.  దేవతలు నలుని రూపం ధరించి స్వయం వరానికి వచ్చారు. నలుగురూ ఒకే రూపంలో ఉన్నారు. దమయంతి పూలమాల చేతబూని పెళ్ళి కుమారుని వద్దకు వచ్చింది. మనసులో ఇష్ట దైవాన్ని తలచుకుంది. నలుగురిలో ఎవరు తనను వరించిన నలుడా తెలుసుకుంది. దేవతల పాదాలు నేలపై తేలియాడటం గమనించింది. నలుడు నేలపై నిలబడియున్నాడు. నలుని మెడలో పూలదండ వేసింది. నలుని వివాహమాడింది. దేవతలు పూల వర్షం కురిపించారు.

స్వయం వరానికి వచ్చిన "కలిపురుషుడు" ఈర్ష్య చెందాడు. దమయంతిని నలుడు వివాహం చేసుకోవడం తట్టుకోలేకపోయాడు. నలుని ఆవహించాడు కలిపురుషుడు. నలునికి కష్టాలు మొదలైనాయి. జూదములో రాజ్యం పోగొట్టుకున్నాడు. దమయంతితో అడవుల పాలైనాడు. తిండి తిప్పలు లేక అల్లాడిపోయాడు.

కలిమాయ వలన నిద్రపోతున్న దమయంతిని వదలి వెళ్ళిపోతాడు. దమయంతి తాను కనపడకపోయేసరికి తండ్రి వద్దకు వెడుతుంది. ఆమెకు కష్టాలు తప్పుతాయి అనుకున్నాడు నలుడు. అలాగే జరిగింది. నలుడు ఒంటరిగా అరణ్యంలో తిరుగుతున్నాడు. ఒకచోట



అడవిలో అగ్ని మంటలు మండుచున్నాయి. ఆ మంటల మధ్యలో ఉన్న పాము రక్షింపమని వేడింది. నలుడు దానిని రక్షించాడు. దాని పేరు కర్కోటకుడు. అది తనను రక్షించిన నలుని కరచెను. కర్కోటకుడు కరువగా నలునకు వికృతరూపం వచ్చింది. ఈ రూపం నీకు మేలు చేస్తుంది. నీవు కోరుకున్నపుడు నిజరూపం వస్తుంది అని చెపుతాడు కర్కోటకుడు. కొన్ని విద్యలు కూడా నేర్పుతాడు. రుతుపర్ణుడను రాజు వద్దకు వెళ్ళి వంటల వాడుగా ఉంటాడు. బాహుకుడు అని పేరు మార్చుకుంటాడు.

దమయంతి తండ్రి నలుని రప్పించాలని ద్వితీయ స్వయంవరం ప్రకటిస్తాడు. రుతుపర్ణుడు బాహుకుడిని తీసుకుని స్వయంవరానికి వెడతాడు. నలుడు కర్కోటకుడు చెప్పిన మంత్రంతో తిరిగి నిజస్వరూపాన్ని పొందుతాడు. దమయంతిని ద్వితీయ స్వయంవరంలో భార్యగా పొందుతాడు.

తెలియక నలమహారాజుకు చెప్పరాని పనులు చెప్పినందుకు రుతుపర్ణుడు బాధపడతాడు. నలునకు అక్షయ విద్య అనే విద్యను నేర్పుతాడు. అప్పుడు కలిపురుషుడు నలుని విడిచి వెళ్ళిపోతాడు. నలుడు దమయంతితో సుఖంగా ఉంటాడు.



# 11 బకాసురుడు

బకాసురుడు ఒక రాక్షసుడు. ఏకచక్ర పురం సమీపంలో అడవులలో ఉంటాడు. ఏకచక్రపురం లోని మానవులను ఇష్టం వచ్చినట్టు చంపి తింటుంటాడు. ఆ బాధలు తట్టుకోలేక ప్రజలు అంతా ఒక నిర్ణయానికి వచ్చారు. బకాసురుడితో మొరపెట్టుకొన్నారు. రోజూ బండి అన్నం, రెండు దున్నపోతులు, ఒక మనిషిని ఆహారంగా పంపుతాము మమ్ములను చంపకు అని వేడుకున్నారు. బకాసురుడు సరే అన్నాడు. నాకు కష్టాలు తప్పాయి, రోజూ ఆహారం నాదగ్గరకే వస్తుంది అని సంతోషపడ్డాడు. అదే విధంగా బకాసురుడికి ఆహారం పంపుతున్నారు. అడవిలో ఉన్న బకాసురుడు బండెడు అన్నం, రెండు దున్నపోతులు, బండిని తోలుకు వచ్చిన మనిషిని తింటున్నాడు.



బండిలో అన్నం అంతా తింటూ ఒక మనిషి వచ్చాడు. బండిలో అన్నంలేదు. బకాసురునికి కోపం వచ్చింది. ఇద్దరికి ముష్టి యుద్ధం జరిగింది. పోరు భయంకరంగా సాగుతోంది. బకాసురుడు చచ్చిపోయాడు. చంపింది ఎవరో కాదు భీమసేనుడు. బండెడు అన్నం తిన్నాడు భీముడు. బకాసురుని పిడిగుద్దులు గుద్దాడు. బకాసురుడు చచ్చాడు. ప్రజలంతా హర్షించారు.

## 12 ధర్మవ్యాధుడు

ధర్మవ్యాధుడు ఒకబోయవాడు. మహాజ్ఞాని. సమస్త ధర్మములు తెలిసినవాడు. మిథిలా నగరంలోఉంటున్నాడు. తల్లిదండ్రులకు సేవ చేస్తూఉంటాడు. కులవృత్తిని నమ్ముకున్నవాడు. "కులవృత్తిని మరువకయ్యా గువ్వలచెన్నా!" అని గువ్వల చెన్నుడు చెప్పినట్లు చేస్తాడు. మాంసం నరికి అమ్ముకుంటాడు. వచ్చిన డబ్బుతో కుటుంబపోషణ చేస్తుంటాడు.

కౌశికుడు అనే బ్రాహ్మణుడున్నాడు. తపస్సు చేసుకుంటూ ఉంటాడు. ఊరికి దూరంగా ఉన్న అడివిలో ఉంటాడు. ఒక సరస్సుగట్టుమీద చెట్టుక్రింద కూర్చుండి తపస్సు చేసుకుంటూ ఉంటాడు.

మధ్యాహ్నం వరకు తపస్సు చేసుకుంటూ ఉంటాడు. మధ్యాహ్నం బయలు దేరి నాలుగిళ్ళు తిరుగుతాడు. ఇంత భోజనం పెట్టించుకుంటాడు. తిని మరల తపస్సు చేసుకుంటాడు.

ఒకరోజు ఏంజరిగిందంటే, రోజూలాగ తపస్సు ముగించుకొని ఊళ్ళోకి రావాలనుకున్నాడు. ఇంతలో తలమీద రెట్టపడింది. కౌశికుడు చెట్టుపైకి చూశాడు. కొంగ గిలగిలా కొట్టుకుంటూ కిందపడింది. చచ్చిపోయింది. నా తపస్సు ఫలించింది అనుకున్నాడు. స్నానం చేశాడు. ఊళ్ళోకి బయలుదేరాడు. రోజూ వెళ్ళే ఇంటికి వెళ్ళాడు. "మాతా కబళం" అనికేక వేశాడు. ఇంటిముందు నిలబడ్డాడు. ఆ ఇంటి ఇల్లాలు కౌశికుని కేక విన్నది. అన్నం పట్టుకు రావాలనుకుంది. ఇంతలో ఆమె భర్త వచ్చాడు. ఆయనకు సపర్యలు చేసి భోజనం పెట్టింది. భర్త విశ్రాంతి తీసుకుంటూ నిద్రించాడు. అంతవరకు ఆయనకు సేవలు చేసింది. భోజన పదార్థాలు తీసుకుని బయటకు వచ్చింది. కౌశికునకు కోపం వచ్చింది. ఎన్నడూ లేనిది ఇంటి ముందు ఇంతసేపు నిలబెట్టినందుకు కోపం వచ్చింది. ఆయన కోపం చూసింది. నీవు కోపంతో చూస్తే నేను చావటానికి కొంగను కాదు అన్నది. కౌశికునకు భయం వేసింది. అక్కడ ఎక్కడో జరిగింది ఈమెకు ఎలా తెలిసింది? అని భయం వేసింది. ఆమె కాళ్ళమీద పడ్డాడు. క్షమించమన్నాడు. ఆమె, నాభర్త నాకు దైవం, ఆయన సేవే నాకు ముఖ్యం. ఆ తరువాతే అతిథి మర్యాదలు. నాకు



పతియే ప్రత్యక్షదైవం. అంతకంటే నావద్ద ఏశక్తీ లేదు. నీవు తెలుసుకోవలసిన ధర్మాలు ఉన్నాయి. మిథిలా నగరానికి వెళ్ళు. అక్కడ ధర్యవ్యాధుడున్నాడు. జ్ఞానవంతుడు. నీకు కలిగిన ధర్మ సందేహాలు తీరుస్తాడు. నీవు తెలుసుకోవలసిన ధర్మాలు చెపుతాడు. అని సెలవిచ్చింది.

కౌశికుడు మిథిలా నగరానికి వెంటనే బయలు దేరుతాడు. ఆ నగరం చేరుకుంటాడు. ధర్మవ్యాధుడు ఎక్కడ అని అడుగుతాడు. వారినీ వీరినీ అడుగుతూ ధర్మవ్యాధుని చేరుకుంటాడు. ధర్మవ్యాధుని చూస్తాడు. మాంసం నరికి అమ్ముకుంటూ వుంటాడు. ఆ పతివ్రత పంపింది ఈయన వద్దకా? కాదనుకుంటాను! అని సందేహ పడుతుంటాడు.

వృత్తిధర్మంలో నిమగ్నమైవున్న ధర్మవ్యాధుడు కౌశికుని గమనించాడు. కౌశికుడు మాంసం దుకాణం నుంచి వచ్చేవాసన భరించలేడు. ముక్కులు మూసుకుంటూ ఉంటాడు. ఇదేమిటిరా ఖర్మ అనుకుంటాడు. నేను రావలసింది ఇక్కడికేనా? పొరబడ్డానా? ఆమె ఇతని వద్దకు ఎందుకు పంపుతుంది? అనుకుంటాడు.

ధర్మవ్యాధుడు కౌశికుని చూశాడు. రా నాయనా! ఆ యమ్మ పంపించిందికదూ? రా... ఇక్కడ కూర్చో వెళదాం అంటాడు. కౌశికుడు మారు మాట్లాడడు. కాళ్ళు గడగడా వణికి పోతున్నాయి. కౌశికునకు ఏమీ అర్థం కావడంలేదు. భయము, వణుకు పుచ్చుకున్నాయి. ఆమెకేమో కొంగ చచ్చిన సంగతి తెలిసింది. ఈయనకు ఆమె పంపించిన సంగతి తెలిసింది. భయం కలిగింది.

ధర్మవ్యాధుని కాళ్ళపై పడ్డాడు. క్షమించమన్నాడు. ఉండునాయనా వెళదాం. ఈ కాస్త మాంసం అమ్ముకొని వస్తాను అన్నాడు. అమ్మిన తరువాత ఇంటికి చేరుకొంటారు.

ఇంట్లో కుక్కి మంచంలో ధర్మవ్యాధుని తల్లి దండ్రులు ఉంటారు. వారిని చూపించాడు ధర్మవ్యాధుడు. నాయనా! నేనేమీ తపస్సు చేయను. కులవృత్తిని నమ్ముకున్నాను. జీవహింస చేయను. ఎవరో చంపిన మాంసం అమ్ముతాను. తల్లిదండ్రులను పూజిస్తూ ఉంటాను. నాకింకేమీ తెలియదు ఇదే నా శక్తి.

కౌశికునికి ధర్మబోధ చేస్తాడు. తల్లిదండ్రులను పూజించాలి. భార్యాపిల్లలను వదలి అడవిలో తపస్సు చేస్తే మోక్షం రాదు. అని ఎన్నో బోధిస్తాడు. కౌశికునిలో మార్పు వచ్చేటట్లు బోధిస్తాడు ధర్మవ్యాధుడు.

ఇతనికి అర్జునుడు అను కుమారుడు కలడు. ఒక కూతురును ఉన్నది. ఆమెను మతంగుని కుమారుడైన ప్రసన్నుడికి ఇచ్చి వివాహం చేశాడు. ఆమె పేరు అర్జునకి. ఈమె అత్తగారు ఈమెను నిందించెను. జంతువులను చంపువాని కూతురని నిందించెను. ఆ విషయం ధర్మవ్యాధునకు తెలిసెను.

ఒకనాడు ధర్మవ్యాధుడు కూతురి అత్తవారింటికి వస్తాడు. నేను భోజనము చేయుదును, ఏమి పెడతారు అని అడిగాడు. ఆమె వంట ధాన్యం తెచ్చి చూపింది. మీరు రోజూ ఇన్ని జీవాలను చంపుతున్నారు. నేను వారానికి ఒక్క జీవాన్నే చంపేది. మీ ఇంట తినను అని వెళ్ళబోతుంటే మతంగుడు తప్పు తెలుసుకుంటాడు. ధర్మవ్యాధుడు మతంగుని కూడా మార్చాడు.



# 13 శల్యుడు

పాండవుల మేనమామ శల్యుడు. పాండురాజు భార్య మాద్రి. మాద్రి తోబుట్టువు శల్యుడు. మద్ర దేశానికి రాజు శల్యుడు. ఒక్కమాటలో చెప్పాలంటే నకుల, సహదేవుల వేలువిడిచిన మేనమామ. పాండవుల పక్షపాతి.

కౌరవులకు, పాండవులకు జరిగే యుద్ధం కురుక్షేత్రం. కురుక్షేత్రం అనే ప్రాంతంలో జరుగుతుంది కనుక ఆ యుద్ధాన్ని కురుక్షేత్ర సంగ్రామం అన్నారు.

యుద్ధంలో పాండవుల తరుపున పాల్గొనడానికి వస్తున్నాడు శల్యుడు. దుర్యోధనుడు, శల్యుడు వచ్చే మార్గంలో బస ఏర్పాటు చేశాడు. ఆ బసలో విశ్రాంతి తీసుకున్నాడు శల్యుడు. మందు, విందు ఏర్పాటు చేశాడు దుర్యోధనుడు. ఆ ఏర్పాట్లకు ముగ్ధుడైనాడు శల్యుడు. మందు మత్తులో మునిగిపోయాడు. విందు ఏర్పాటు చేసిన వారికి వరాలు ఇస్తానన్నాడు. దుర్యోధనుడు వరమడిగాడు. కర్ణునికి రథ సారథ్యం చేయమన్నాడు. ఆడిన మాట తప్పుకోలేని శల్యుడు సరేనన్నాడు. మద్యం మత్తు ఎంత అనర్థం జరుగుతుందో చూడండి.

శల్యుడు కర్ణునికి రథసారథియైనాడు. పాండవుల తరుపున యుద్ధం చేయవలసిన వాడు, కౌరవుల పక్షం వహించవలసి వచ్చింది. కర్ణుని రథం నడిపే సామర్థ్యం శల్యునికే ఉంది. ఇతరులకు లేదు. శల్యుడు రథసారథ్యం చేయడంలో గొప్పవాడు.

కర్ణుని రథం తోలుతున్నాడేగాని మనసు అర్జునుని విజయం పై ఉంది. ఏమీ చేయలేని పరిస్థితి. కర్ణుని సారథిగా ఉన్నాడే గాని, అర్జునుని పొగడుతున్నాడు. కర్ణునికి, అర్జునునికి నక్కకి నాగలోకానికి ఉన్నంత తేడాఉందని అంటాడు. అడుగడుగునా కర్ణుని అవమాన పరుస్తాడు. ప్రత్యర్థి బలాబలాలను పొగుడుతూ ఉంటాడు. కర్ణుని ఎప్పటికప్పుడు నిరుత్సాహ పరుస్తూ ఉంటాడు. ఏమీ చేయలేని పరిస్థితి కర్ణుడిది. శల్యుడి అవమానాలు అన్నీ భరిస్తూ ఉంటాడు. మనకు హితులుగా ఉంటూ శత్రువులకు సాయం చేసేవారిని శల్య సారథ్యం అంటారు. మన మేలు కోరుతున్నట్లు గా కనిపిస్తూ ఎదుటి వారి విజయానికి కృషి చేస్తూ వుంటారు శల్య సారథులు.

# 14 మయబ్రహ్మ-మయసభ

మయుడు విశ్వకర్మ. సృష్టికర్త. మను; మయ; త్వష్ట; శిల్పి; దైవజ్ఞ అను పంచ బ్రహ్మలలో మనుబ్రహ్మ ఆద్యుడు. మయుడు నిర్మించిన సభ కనుక దానికి మయసభ అనిపేరు వచ్చింది. మయుని అద్భుత సృష్టి మయసభ. ఈ మయసభలో దుర్యోధనుడు పరాభవం పొందుతాడు. మహా భారతంలో మయసభ ఘట్టం ప్రాధాన్యత ను సంతరించుకొంది. మహాభారత కథకు గొప్ప మలుపు నిచ్చింది.

సృష్టికర్త విశ్వకర్మ తన కళా నైపుణ్యమును అడుగడుగునా చూపించాడు. రాజులకు రాజు, రారాజు అయిన దుర్యోధనునే భ్రమలో పడవేసింది ఈ మయసభ. ఉన్నది లేనట్లుగాను, లేనిది ఉన్నట్టు గాను కనిపించడం ఈ మయసభ ప్రత్యేకత. పాండవులు అర్థరాజ్యం పంచు కుంటారు. ఖాండవ ప్రస్థమున వారు ఒక పురమును నిర్మించుకుం టారు. అది విశ్వకర్మచే నిర్మింపబడినది. దానికి ఇంద్రప్రస్థము అని పేరు పెడతారు. ఇంద్రప్రస్థము అచ్చం అమరావతి లాగ ఉంటుంది. అందులో ధర్మరాజు కొరకు ప్రత్యేకంగా నిర్మించబడింది "మయసభ". మయసభలో ఎన్నో చిత్ర విచిత్రాలు ఉన్నాయి. ఇక్కడ తలుపు ఉంది అని పోబోతే అక్కడ గోడతగిలి తల బొప్పె కడుతుంది. ఇక్కడ నీళ్లు ఉన్నాయని జాగ్రత్తగా కాలు







పెడితే అక్కడ నేల మాత్రమే. నేల అనుకొని నడవబోతే నీళ్లు ఉంటాయి. ఇది సెలయేరు అని నీళ్ళు తాగబోతే అది కాదు. మామూలు నేల.

దుర్యోధనుడు మయసభలోని చిత్రవిచిత్రాలకు లోనౌతాడు. తలుపు ఉన్నది అని పోబోతే తలకు బొప్పి కట్టింది. ద్రౌపది చూసి నవ్వింది. అది తీరని అవమానమయింది. పాండవులపై ప్రతీకార వాంఛ పెరిగింది.

మయసభను వర్ణించడం బ్రహ్మతరం కాదు "మయసభ" ఏకపాత్రాభినయం ప్రేక్షకుల మన్ననలు పొందినది. కీర్తిని తెచ్చిపెట్టింది. "నాగశ్రీ గారి మయసభ" బహుళ ప్రాచుర్యం పొందింది. ఎందరో కళాకారులు అభినయించి అవార్డులు పొందారు.

15

# కచుడు

కచుడు బృహస్పతి కుమారుడు. దేవతల గురువు బృహస్పతి. బుద్ధిలో బృహస్పతిని మించినవారు లేరు. కచుడు కూడా తండ్రి వలె బుద్ధిబలం కలవాడు. అనంతమైన తెలివి తేటలున్నాయి. అంతే కాదు మంచి అందగాడు. నవయవ్వనుడు. చదువులన్నీ నేర్చినవాడు.

దేవతలకు రాక్షసువల్ల బాధలు అధికమైనాయి. దేవతలు అమృతం త్రాగినవారు, వారికి చావులేదు. రాక్షసుల గురువు శుక్రాచార్యులు. శుక్రాచార్యుల వద్ద మృతసంజీవిని విద్య ఉన్నది. అందువల్ల చచ్చిన రాక్షసులు మరల లేచి వస్తున్నారు. శుక్రాచార్యులు వారిని బ్రతకనిస్తున్నారు. ఆ మృతసంజీవిని రాక్షసుల వద్దనుండి కాజెయ్యాలి. అందుకు కచుడు సమర్థుడు అనుకున్నారు దేవతలు. శుక్రాచార్యుని వద్ద విద్య నేర్చుకోమని కచుని పంపించారు.

శుక్రాచార్యుల వద్ద శిష్యుడైనాడు కచుడు. శుక్రాచార్యుల కూతురు దేవయాని. అందగాడు, స్ఫురద్రూపి అయిన కచుని చూచి ప్రేమించింది దేవయాని. ఒకనాడు కచుడు అడవికి వెళ్ళి తిరిగి రాలేదు. కంగారుపడింది దేవయాని. తండ్రితో చెప్పింది. వెతికించారు. రాక్షసులు కచుని చంపారు. తగులబెట్టారు అని తెలుసు కున్నాడు. కూతురికి చెప్పాడు. మృత సంజీవిని విద్యతో బ్రతికించ మంది దేవయాని. సరే అన్నాడు. బూడిద ఎక్కడుంది?

ఎక్కడ చంపి తగులబెట్టారో విచారించాలి. తెలుసుకున్నాడు. అడవిలో కచుని తగులబెట్టిన బూడిద కూడా లేదు ఏమైందా అని దివ్యదృష్టితో చూశాడు శుక్రాచార్యుడు. ఆ బూడిద తన కడుపులోనే ఉంది. బూడిద అలానే ఉంటే మరల తన విద్యచే బ్రతికిస్తాడని అనుకున్నారు రాక్షసులు. అనుకున్నదే తడవుగా బూడిదను మద్యంలో కలిపారు. ఆ మద్యాన్ని శుక్రాచార్యులకే ఇచ్చారు. ఇస్తే తాగేశారు. అందుకే కచుని బూడిద తన కడుపులోనే ఉంది అని తెలుసుకున్నాడు. మద్యానికి బానిస అయితే ఎంత అనర్థం జరిగిందో చూశారా?



దేవయాని మంకుపట్టు పట్టింది. నాకు కచుడు కావాలి అంది. ఎలాగైనా కచుని బ్రతికించాలి అంది. కడుపులోఉన్న కచుని బ్రతికిస్తే శుక్రాచార్యుని మరణం తప్పదు. ఆ విద్య శుక్రాచార్యులు ఘోరమైన తపస్సు చేసి నేర్చుకున్నాడు. ఇతరులకు ఎవరికీ నేర్పలేదు. శుక్రాచార్యులు మరణిస్తే బ్రతికించేదెవరు? అన్నీ సమస్యలే! దేవయాని మాత్రం పట్టు వీడలేదు. నిద్రాహారాలు మానుకుంది. శుక్రాచార్యులు ఇరుకున పడ్డాడు. కచుని బ్రతికిస్తే తనకు మరణం. బ్రతికించకపోతే కూతురు మరణం. ఏదో ఒకటి ఆలోచించాలి అనుకున్నాడు శుక్రాచార్యుడు.

ముందుగా తనదగ్గర ఉన్న మృతసంజీవని విద్యద్వారా కచుని బ్రతికించాడు. శుక్రాచార్యుని కడుపులోనే ఉన్నాడు కచుడు.

కడుపులో ఉన్న కచునకు మృతసంజీవని విద్యను బోధించాడు శుక్రాచార్యులు. కచుడు కడుపులో ఉండినేర్చుకున్నాడు. బయటకు వచ్చే దారి ఏది గురువర్యా? అన్నాడు. కడుపు చీల్చుకుని బయటకు రా. వచ్చి నీ విద్య చే నన్ను బ్రతికించు అన్నాడు శుక్రాచార్యులు. కచుడు అలాగే చేశాడు. శుక్రాచార్యుని కడుపు చీల్చుకుని బయటకు వచ్చాడు. శుక్రాచార్యుడు మరణించాడు. గురువు గారి వద్ద నేర్చుకున్న మృతసంజీవని విద్యతో మరల గురువుగారిని బ్రతికించాడు. అందరూ ఆనందించారు. గురుభక్తికి ప్రదర్శించాడు.

ఇలా ఉండగా ఒకనాడు దేవయాని "నేను నిన్ను ప్రేమించాను. నన్ను పెళ్ళిచేసుకో" అన్నది. "తప్పు. గురువంటే తండ్రితో సమానం". "గురువుగారి కూతురుని వివాహ మాడరాదు" అని ఆమెకు హితబోధచేసి స్వర్గానికి వెళతాడు.



# 16 యయాతి

యయాతి చంద్రవంశపు రాజు. దేవేంద్ర పదవి చేసిన "నహుషుని" కుమారుడు. యయాతి తల్లి ప్రియంవద. అశ్వమేధయాగాలు ఎన్నోచేశాడు. పేరుప్రతిష్టలున్న మహా యోధుడు. అందువలన యయాతి "మహారథుడై"నాడు.

ఒకనాడు యయాతి వనవిహారం చేస్తున్నాడు. వనములో ఒకచోట ఆడవారి ఏడ్పు వినిపించింది. ఎటుచూచినా ఎవరూ లేరు. పరిశీలించాడు. ఒక పాడుబడ్డ బావిలో ఒక స్త్రీ ఏడుస్తూ కనపించింది. ముందుగా యయాతి తన పై పంచె ఇచ్చాడు. ఆమె ఆ పంచెను చుట్టుకుంది. యయాతి చెయ్యి అందించాడు. ఆమె యయాతి చెయ్యి పట్టుకుంది. యయాతి ఆమెను పైకి లాగినాడు. ఎప్పుడైతే రాజు చెయ్యిఅందించాడో అప్పుడే ఆమె రాజును ప్రేమించింది.





వృషపర్వుని కూతురు శర్మిష్ఠ. తనను చెలులతో నూతిలో పడవేయించిందని,తనపేరు దేవయాని అని, శుక్రాచార్యులవారి కూతురునని చెప్పింది. రాజుధర్మంగా ఆపదలో ఉన్నవారిని రక్షించాడు. తన దారిన తాను వెళ్ళిపోయాడు.

వృషపర్వరాజుకు గురువు శుక్రాచార్యులు. దేవయాని తండ్రికి జరిగిన సంగతి చెప్పింది. శర్మిష్ఠను తన సేవకురాలిగా చేసుకున్నది. యయాతిని దేవయాని పెండ్లి చేసుకుంది. యదు, తుర్వసులు అను ఇద్దరు కుమారులు పుట్టారు.

శర్మిష్ఠకు పెండ్లి పెటాకులు లేక దేవయానికి సేవలు చేయుచుండెను. యవ్వనంలో ఉన్న శర్మిష్ఠ యయాతిపై మనసు పడింది. అతనికి చేరువైంది. ద్రుహ్యుడను కుమారుడను కన్నది. తరువాత కాలంలో అనుడు, పురుడు అను ఇద్దరు కుమారులు పుట్టారు.

యయాతి రహస్యంగా శర్మిష్ఠతో సంసారం చెయ్యడం బయటపడింది. దేవయాని పుట్టింటికి వెళ్ళిపోయింది. తండ్రి శుక్రాచార్యునికి చెప్పింది. కోపించిన శుక్రాచార్యులు యయాతికి శాపం పెట్టాడు. యవ్వన గర్వంలో ఉన్నావు, ముసలివాడివి అయిపో! అని. యయాతి ప్రాధేయ పడ్డాడు. శుక్రాచార్యులకు కోపం తగ్గలేదు. మీ అమ్మాయి దేవయానిపై నాకు మమకారం తీరలేదు, నన్ను క్షమించు అని శుక్రాచార్యులుతో యయాతి అన్నాడు. కోపం తగ్గింది శుక్రాచార్యులకు. అయితే ఉపశమనం చెపుతాను విను, నీ కొడుకులలో ఎవరైనా నీకు యవ్వనం ఇస్తే తీసుకో, నీ ముసలి తనం వారికి వస్తుంది. అప్పుడు యవ్వన సుఖాలు పొందవచ్చు అన్నాడు శుక్రాచార్యులు అనుగ్రహించి.

యయాతి తన కొడుకులనందరినీ పిలిచాడు శుక్రాచార్యులు పెట్టిన శాపం గురించి చెప్పాడు. మీలో ఒకరు మీ యవ్వనం ఇవ్వండి అన్నాడు. "ఇంతవరకు అనుభవించిన సుఖాలు చాలవా, యవ్వనంలో ఉన్న మేము ఏ సుఖము అనుభవించక ముసలి వాళ్ళం కావాలా? మాకిదేం ఖర్మ? మేము ఇవ్వం" అన్నారు ఐదుగురు కుమారులు. చిన్నవాడు, చివరివాడు అయిన శర్మిష్ఠ కుమారుడు పురూరుడు యవ్వనం ఇస్తానన్నాడు.

పురూరుని యవ్వనం తీసుకుని యయాతి వెయ్యేండ్లు పాలించాడు. తరువాత ఆ యవ్వనాన్ని పురూరునికి ఇచ్చివేశాడు. రాజ్యభారం పురూరునికి అప్పగించాడు.

పురూరుడు రాజ్యభారం వహించి ప్రజలను కన్నబిడ్డలు లాగా చూసుకొన్నాడు. బహుకాలం పాలించాడు.



కుమారులు యవ్వనం ఇవ్వలేదని వారిని శపించాడు. యదువును "నీ వంశములోని వారు రాజార్హులు కాకుందురు గాక" అని. తుర్వరుని వంశమువారు సంకరులైపోతారని. ద్రుహ్యుని వంశములోని వారు ద్వీపముల పాలౌతారని శపించాడు. అలాగే వారి వంశాలు సాగినై. ఒక్క పురూరుడే ప్రజానురంజకముగా ప్రసిద్ధి గాంచాడు.

శర్మిష్ఠ పై పంతం, ప్రతీకారంతో బ్రాహ్మణపుత్రి అయిన దేవయాని యయాతిని వివాహమాడింది. రాజకుమారి అయిన శర్మిష్ఠను దాసీని చేసుకుంది. అయిని దేవయాని కుమారులు వారసులు కాలేదు. రాజ వంశీయుడైన శర్మిష్ఠ పుత్రుడు పురూరుడే పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నాడు.

1. హరిశ్చంద్రుడు, 2. నలుడు, 3. పురుకుృడు, 4. పురూరవుడు, 5. సగరుడు, 6. కార్తవీర్యుడు అనువారు షట్చక్రవర్తులు. వారిలో ఒకడై ప్రజలను బహుకాలం పాలించాడు పురూరుడు. పురూరుడు యయాతి కుమారుడు.



# 17 ఘటోత్కచుడు

"హిడింబి" అను రాక్షక కాంతకు, భీమునకు పుట్టినవాడు ఘటోత్కచుడు. రాక్షసి కడుపున పుట్టిన వాడైనా, ఉత్తమ గుణములు కలవాడు. సదాచార సంపన్నుడు. రాక్షసులకు ఉండవలసిన దుర్మార్గపు బుద్ధులు ఘటోత్కచునిలో లేవు.

పాండవులు కాశీ నగరానికి అరణ్య మార్గం గుండా వెళుతున్నారు. మార్గమధ్యంలో విశ్రాంతి కొరకు "లక్కఇల్లు" కట్టిం చాడు దుర్యో ధనుడు. పాండ వులు ఆ లక్క ఇంట్లో నిద్రి స్తున్న పుడు ఆ ఇల్లు తగుల బెట్టిం చా లని దుర్యో ధను ని దురాలోచన.



అనుకున్నట్లుగానే పాండవులు లక్కఇంట్లో మకాం పెట్టారు. పాండవులకు అది లక్కఇల్లు అని తెలియదు. ఆ విషయం తెలిసిన విదురుడు వర్తమానం పంపిస్తాడు. పాండవులను లక్కఇంట్లో నిదురించవద్దని చెపుతాడు. ధర్మరాజు లక్క ఇంటినుండి అందరిని తప్పిస్తాడు. అందరూ క్షేమంగా బయట పడతారు. అడవిలో ఒక చోట మకాం పెట్టారు. రాత్రికి భీమసేనుడిని కాపలా కాయమన్నాడు ధర్మరాజు.

ఆ అటవీప్రాంతం హిడింబాసురుడను రాక్షస రాజుది. "హిడింబాసురుని" కూతురు హిడింబి. మెలకువతో కాపలా కాస్తున్న భీముని చూసింది. భీమునికి సాయపడింది. అడవిలో ఉన్నంతకాలం వారికి సాయపడింది. రాత్రిళ్ళు కాపలా కాసింది. భీమసేనునిపై మోజుపడింది. వివాహమాడమని కోరింది. భీమసేనుడు నిరాకరించాడు. ఆ విషయం ధర్మరాజుకు తెలిసింది. ఆమె కోర్కెను తీర్చమన్నాడు. భీమసేనుడు హిడింబిని వివాహం చేసుకున్నాడు. వారిరువుని కుమారుడేన ఘటోత్కచుడు. పాండవులకు అన్ని వేళలలో చేదోడు వాదోడుగా ఉన్నాడు. కురుక్షేత్ర సంగ్రామంలో పాండవుల తరపున పోరాడుతాడు.



ద్రోణాచార్యులు మొదలైన వారిని ఎదుర్కొంటాడు. కర్ణుడితో ఘోరంగా తలపడతాడు.

కర్ణుని కవచ కుండలాలు ఇంద్రునికి దానం చేశాడు. అందుకు ప్రతిఫలంగా ఇంద్రుడు అస్త్రాన్ని ఇస్తాడు. కర్ణుడు, ఇంద్రుడిచ్చిన అస్త్రాన్ని ఘటోత్కచునిపై ప్రయోగిస్తాడు. కర్ణుడు ప్రాణం కాపాడుకుంటాడు. అంతటి బలశాలి ఘటోత్కచుడు. ఇంద్రచాపంతో ఘటోత్కచుడు మరణిస్తాడు. ఘటోత్కచుని ప్రాణం అర్జునుని ప్రాణం కాపాడగల్గింది. లేకుంటే కర్ణుడు ఆ చాపాన్ని అర్జునినిపై ప్రయోగించేవాడు. ఘటోత్కచుని జన్మ ధన్యమైంది. వీర స్వర్గం పొందుతాడు.



# 18 అక్షయ పాత్ర

ధర్మరాజు దుర్యోధనునితో జూదంలో ఓడిపోతాడు. దుర్యోధనుడు శకుని మాయా పాచికల వలన ఓడించాడు. జూదంలో పెట్టుకున్న పందెం ప్రకారం పాండవులు అరణ్యవాసం చెయ్యాలి. పాండవులు అరణ్యవాసానికి వెళ్ళారు. వెంట కొంత పరివారం కూడా ఉన్నారు. పురోహితుడు ధౌమ్యుడు కూడా వీరి వెంట ఉన్నాడు. కట్టుబట్టలతో అరణ్యవాసానికి వెళ్ళారు. చేతిలో నయాపైసా కూడాలేదు.

అరణ్యవాసానికైతే చేరుకున్నారు. "ఏపాటూ లేకపోయినా సాపాటు తప్పదన్నట్లు వారి భోజనాల సంగతేమిటి. తీరని సమస్య అయింది వారికి. కందమూలాలతో కడుపు నింపుకుందామనుకున్నారు. పంచపాండవులే అయితే అలా చేసేవారేమో, మరి వెంట ఉన్న పరివారం సంగతేమిటి. ఏమి చెయ్యాలో ఆలోచనలో పడ్డాడు ధర్మరాజు. పురోహితుడు ధౌమ్యుని సలహా అడిగాడు. ధౌమ్యుడు సూర్యభగవానుని వేడుకోమన్నాడు. ధర్మరాజు సూర్యభగవానుని ప్రార్థించాడు. సూర్యుడు ప్రత్యక్షమైనాడు. సంగతి తెలుసుకున్నాడు. ధర్మరాజుకు వచ్చిన ఇబ్బంది తీరుస్తానన్నాడు.

విశ్వకర్మ భగవానుని అల్లుడు సూర్యుడు. విశ్వకర్మభగవాన్ కూతురు ఛాయాదేవి ని పెండ్లి చేసుకున్నాడు సూర్యభగవానుడు. ధర్మరాజు పరిస్థితిని విశ్వకర్మ భగవానునికి వివరించాడు. అందుకు తగిన ఏర్పాటు చేస్తానన్నాడు విశ్వకర్మ. ఒక రాగి పాత్రను సృష్టించి ఇచ్చాడు. దానికి మహిమను ఆపాదించాడు. అదే అక్షయ పాత్ర. బంతిలో ఎంతమంది కూర్చున్నా అంతమందికీ పంచభక్ష్య పరమాన్నాలను అందిస్తుంది. కాని, అందరూ భోజనం చేసిన తరువాత కడిగి పక్కన పెడితే మరల ఆ పూటకు ఇంక పని చేయదు. అట్టి మహిమాన్వితమైన అక్షయ పాత్రను సూర్యభగవానుడు పాండవులకు ఇచ్చాడు.

అరణ్యవాసంలో అక్షయపాత్రే పాండవులను ఆదుకొంది. అయితే దుర్యోధనునికి బాధగాఉంది. అరణ్యవాసంలో పాండవులు హాయిగా ఉన్నారే. అని. వాళ్ళను అవమాన

## ౨౦ ఏకలవ్యుడు

“అభ్యాసము కూసువిద్య” అన్నారు పెద్దలు. రోజూ సాధన చేస్తే అలవాటై పోతుంది. ఎంతటి విద్య అయినా అభ్యాసం క్రమం తప్పకుండా చేస్తే నేర్చు కోవచ్చు అని ఈ సామెత చెపుతుంది. ఈ విషయం “సాధనమున పనులు సమకూరు ధరలోన” అన్నాడు వేమన కవి.

ఈ విషయాన్ని అక్షర సత్యం చేశాడు “ఏకలవ్యుడు”. మన పెద్దలు గురువు ద్వారా విద్యలు నేర్చుకోవాలి అని చెపుతూ ఉంటారు. “గురుముఖతః విద్య” అంటారు. కాని ఏకలవ్యుడు స్వయంకృషితో విలువిద్యను నేర్చాడు. ఆ విషయం తెలుసుకుందాం.

“ఏకలవ్యుడు” ఎరుకలవాడు. ““హిరణ్యధన్వుడను” ఎరుకలరాజు కుమారుడు. తెలివి గలవాడు. పట్టుద ల, దీక్ష గలవాడు. ఏ కార్యాన్నైనా సాధించే వరకు నిద్రపోడు. అస్త్ర విద్యను నేర్చుకోవాలనుకున్నాడు. అందుకు తగిన గురువు ఎవరా? అని ఆలోచించాడు. కౌరవులకు, పాండవులకు విద్యనేర్పు ద్రోణాచార్యులు గొప్పవాడని తెలుసుకున్నాడు. ఒకనాడు ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళాడు. నమస్కరించాడు.

విలువిద్య నేర్పమన్నాడు. “ద్రోణుడు, శూద్రులకు నేర్పను” అని తిరస్కరించాడు. అంతే నిరాశతో ఇంటికి వచ్చాడు. వట్టుదల పెరిగింది. న్వయంగా నేర్చుకోవాలి అనుకున్నాడు. ద్రోణుడిపై గురుభక్తి మాత్రం సన్నగిల్లలేదు. ద్రోణాచార్యులే నా గురువు అని మనసులో నిర్ణయించు





కున్నాడు. వెంటనే మట్టితో ద్రోణాచార్యుని బొమ్మను చేసి పెట్టుకున్నాడు. దానికి నమస్క రించాడు. విలువిద్యను అభ్యాసం చేశాడు. రోజూ ఇదేవిధంగా ద్రోణుడే నా గురువు అని మొదట నమస్కరించుకొని సాధన చేస్తున్నాడు. విలువిద్య లో ప్రావీణ్యం సంపా దించుకున్నాడు.

కౌరవులు, పాండవులు ఒకరోజున వేటాడుటకు అరణ్యానికి వచ్చారు. ఆ అటవీ ప్రాంతం ఎవరిదో కాదు, ఏకలవ్యుని తండ్రి హిరణ్యధన్వుడు పాలించే ప్రాంతం. కురుపాండవుల వెంట వేటకుక్కలు ఉన్నాయి. అందులో ఒక కుక్క ఏకలవ్యుని చూచి కరవబోయింది. ఏకలవ్యుడు దానిని “బాణంతో కొట్టి” చంపకుండా వదలివేశాడు. ఆ కుక్క మొరుగుతూ తిరిగి కురుపాండవుల చెంతకు వెళ్ళింది. అది చూచి కురుపాండవులు ఆశ్చర్యపోయినారు. కుక్కమీద ఏకలవ్యుడు వేసిన బాణం తీరు చూశారు. విస్తుపోయారు. ఆ విషయం గురువు ద్రోణా చార్యులవారికి చెప్పారు. మాకంటే విలువిద్య లో ఘనుడున్నాడని వాపోయారు.

ద్రోణాచార్యులవారు స్వయంగా ఏకలవ్యుని వద్దకు వచ్చారు. ఈర్ష్యపడ్డాడు. కురుపాండవుల కంటే, నా శిష్యులకంటే విలువిద్యలో గొప్పవాడు ఉండకూడదు అనుకున్నాడు. గురుద్రోహం చేశాడు. ఏకలవ్యుని విలువిద్యా నైపుణ్యాన్ని నాశనం చేయాలనుకున్నాడు.

ఏకలవ్యుడు, గురువు ద్రోణాచార్యులు తనవద్దకు వచ్చినందుకు సంబరపడి పోయాడు. మీ ప్రభావం వల్ల నేను విలువిద్యనేర్చుకున్నాను. అయితే గురుదక్షిణ ఏమిస్తావు అన్నాడు ద్రోణుడు. ఏమి కావాలన్నా ఇస్తానన్నాడు ఏకలవ్యుడు. అయితే నీ కుడిచేతి బొటన వ్రేలు కోసి ఇవ్వు అన్నాడు. గురువు గారి కోర్కె తీర్చడం శిష్యుని .

కుడిచేతి బొటనవ్రేలు పోతే బాణాలు వేయలేరు. ఏకలవ్యుడు తను నేర్చిన విద్యలన్ని పోగొట్టుకున్నాడు. ఎన్ని విలువిద్యలు నేర్చినా ఏమి ఫలం, బొటన వ్రేలు లేనిదే బాణాలు వేయలేరు.

ద్రోణుడి స్వార్థానికి బలి అయిపోయాడు ఏకలవ్యుడు. “గురువు” అనే అభిమానంతో గురు ఋణం తీర్చుకున్నాడు. ఆచంద్ర తారార్కం కీర్తితో నిలబడిపోయాడు.

# 21 నారదుడు

నారదుడు బ్రహ్మదేవుని కుమారుడు. విష్ణుమూర్తికి మనుమడు. మూడు లోకాలు తిరుగుతూ ఉంటాడు. ఒక చోట కుదురుగా ఉండడు. అజన్మ బ్రహ్మచారి. నిత్యం హరినామ స్మరణ చేస్తూఉంటాడు. నారదుడు వాయించు వీణపేరు 'మహతి'. లోకాలలో జరిగే వింతలు విశేషాలు తెలుసుకుంటాడు. అవి ఎవరికి చేరవేయాలో వారికి చేరవేస్తుంటాడు. లోక కళ్యాణం కొరకు వారికి, వీరికి తగవులు పెడుతుంటాడు. అందువలన నారదుని "కలహ ప్రియుడు", "కలహ భోజనుడు" అంటారు.



ఎవరెవరికి తగవులు పెట్టినా, నారదుని అందరూ గౌరవిస్తారు. ఎవరూ అగౌరవంగా మాట్లాడరు. దుష్టులను శిక్షించుటకొరకు, శిష్టులను రక్షించుట కొరకు నారదుడు తగవులు పెడుతుంటాడు. ఎవరికి చెప్పే మాటలు వారికి చెపుతాడు. అందులో ఆంతర్యం గ్రహించుకొని నడుచుకోవడం వారి వారి గుణ స్వభావాలను బట్టి ఉంటుంది. అంతే గాని నారదుని తప్పు ఏమీలేదు.

ఒకనాడు శ్రీకృష్ణుడు పారిజాత పుష్పాన్ని రుక్మిణికి ఇచ్చాడు. అది తెలిసి సత్యభామ





ఈర్ష్యపడింది. సత్యభామ గర్వభంగం చేయడానికి శ్రీకృష్ణతులభారం కల్పించాడు. సత్యభామ గర్వభంగం జరిగింది. సత్యభామకు ప్రేమ, భక్తి అంటే బోధపడింది.

అలాగే ఇంద్రుడు లీలావతిని బంధించాడు. రాక్షస సంహారం చేయబూనాడు. లీలావతి గర్భవతి, ఆమె కడుపులోనున్నది ప్రహ్లాదుడని చెప్పి వారించాడు.

ఈ విధంగా నారదుడు ప్రతీ పనిలోను లోకోపకారం చేస్తాడు. రాక్షస సంహారం జరిగిన చోట నారద ప్రమేయం ఉంటుంది.

నిరంతరం నేను హరినామ జపం చేస్తుంటాను, నేనే గొప్ప వాడిని అనే భావం కలిగింది. ఒకనాడు శ్రీకృష్ణునితో ఈ మాట అంటాడు. ఒకరోజు పొలందున్నే రైతు భగవన్నామం జపించి పొలం దున్నటం మొదలు పెడతాడు. పనిలో నిమగ్నమైపోతాడు. నేను చూడు నిన్ను ప్రతిక్షణం జపిస్తాను. మానవులు రోజులో ఒకటి రెండు సార్లు నీ నామం జపిస్తారు అన్నాడు.

శ్రీకృష్ణుడు ఒక గిన్నెనిండా నూనెపోయించి ఇచ్చాడు. ఈ గిన్నెలో నూనె తొణికి పోకుండా భూప్రదిక్షణం చేసి రా అన్నాడు. నారదుడు హరినామ జపం చేసి గిన్నెపట్టుకున్నాడు. భూప్రదిక్షణం చేస్తున్నాడు. నూనె ఎక్కడ తొణికి పోతుందో అని అదే ధ్యాసలో నున్నాడు. తిరిగి చేరుకున్నాడు. ఇదిగో తొణికి పోకుండా తెచ్చాను అని శ్రీకృష్ణునకు చూపించాడు. ఎన్నిసార్లు నామజపం చేశావు అన్నాడు శ్రీకృష్ణుడు. నారదుడు తప్పు తెలుసుకున్నాడు. మానవులు గొప్పవారే, వారిని తక్కువ అంచనా వేయరాదు అని తెలుసుకున్నాడు.

## ౨౨ గుహుడు

గుహుడు శ్రీరామచంద్రుని భక్తుడు. నదిలో పడవ నడుపుకొని చేపలుపట్టుకుని జీవనం చేస్తూ ఉంటాడు. శ్రీరామచంద్రుడు తండ్రి మాట ప్రకారం అరణ్యవాసానికి బయలు దేరాడు. వెంట సీతా లక్ష్మణులు ఉన్నారు. మార్గ మధ్యంలో నది దాటవలసి వచ్చింది. నది వద్దకు వెళ్ళారు. గుహుడు తీరానికి పడవను తెచ్చాడు. సీతా లక్ష్మణులు పడవ ఎక్కబోయారు. "ఆగం డాగండి!" అన్నా డు గుహుడు. ఆశ్చర్యపో యాడు శ్రీరాముడు. ఏమిటి? అన్నాడు. అయ్యా! మీరు చిన్నత నంలో విశ్వా మిత్రుల వారి యాగం రక్షించడానికి వెళ్ళారు. అవునా? అవునన్నాడు రాముడు. గౌతముని అశ్రమానికి వెళ్ళారా? వెళ్లాను అయితే? అన్నాడు రాముడు. ఐతే ఏమిటి స్వామీ! మీ పాదధూళి సోకి అక్కడ రాయి స్త్రీగా మారిందటగా! అవును అన్నాడు రాముడు. అందుకే స్వామీ భయం. మీ పాదధూళి తగిలితే నా పడవ స్త్రీగా మారితే ఎలా? పోషించేది స్వామీ నేను. ఈ పడవే నాకు జీవనాధారం. కాళ్లు కడగనివ్వండి అని వేడుకున్నాడు.

గుహుని చమత్కారానికి, భక్తికి మెచ్చుకున్నాడు రాముడు. కాళ్లు కడగనిచ్చాడు. సీతా రామలక్ష్మణుల కాళ్ళుకడిగాడు. తరించాడు. పొంగిపోయాడు. వారిని ఆవలి గట్టుకు చేర్చాడు గుహుడు.



తరువాత భరతుడు శ్రీరాముని దర్శించి తల్లి చేసిన తప్పు క్షమించమని కోరటానికి రాగా అడ్డగించాడు గుహుడు. యుద్ధానికి తలపడతాడు. భరతుడు దర్శనార్థం వచ్చాడు అనగా విడిచిపెడతాడు. అంతటి మూఢభక్తుడు గుహుడు.



## ౨౩ మండోదరి

మండోదరి "విశ్వకర్మ బ్రహ్మ మయుని" కూతురు. ఈమె మహా పతివ్రత. పంచమహా పతివ్రతలలో ఒకతి. ఈమె తల్లిపేరు "హేమ". ఒకనాడు తండ్రి మయునితో వన విహారం చేస్తూ ఉంటుంది. అదే అడవికి వేటకు వచ్చాడు రావణ బ్రహ్మ. మండోదరిని చూస్తాడు. ఆమె అందచందాలకు ముగ్ధుడౌతాడు. మయ బ్రహ్మ వద్దకు వెళ్ళి, తాను లంకేశ్వరుడ నని పరిచయం చేసుకుంటాడు. శివ పూజా దురంధరుడనని తనలోని శివభక్తి ని చాటుకుంటాడు. అంతకు ముందే మయుడు రావణబ్రహ్మ గురించి తెలు సుకుంటాడు. రావణబ్రహ్మ అంద చందా లకు, శివభక్తికి మెచ్చి మండో దరినిచ్చి వివాహం చేస్తాడు.

మండోదరి గుణవతి, వినయవతి, మయబ్రహ్మ కూతురు కనుక జ్ఞాన సంపన్నురాలు. భక్తి ప్రపత్తులు గల స్త్రీ. భర్త రావణబ్రహ్మకు తగిన సమయంలో తగిన రీతిలో హిత బోధచేస్తుంది.



రావణబ్రహ్మ సీతను లంకలో ఉంచిన సంగతి తెలిసిన మండోదరి భర్తకు హితవు చెపుతుంది. సీతను విడిచి పెట్టమంటుంది. శ్రీరామచంద్రునితో వైరం తగదని చెపుతుంది. లంకకు ముప్పురానున్నదని చెవిన ఇల్లు కట్టుకు పోరింది. అయినా రావణబ్రహ్మ లెక్కచేయలేదు. మండోదరి బోధను పెడచెవిన పెట్టాడు. అఖరికి కుమారుడు మేఘ నాధుడు శ్రీరాముని చేతిలో హతమైనాడని తెలిసి దుఃఖించింది. అయినా సీతను విడిచి పెట్టలేదు.

వైష్ణవుడైన శ్రీరాముడితో పోరాడాలి అనుకున్నాడు రావణబ్రహ్మ. కైవల్యం పొందడానికి ఆ మార్గం ఎంచుకున్నాడు. అదే వైరభక్తి. సాధించి ముక్తిని పొందాడు రావణబ్రహ్మ.

# 25 మారీచుడు-మాయలేడి.

మారీచుడు రావణబ్రహ్మ అనుచరుడు. మారీచుని తల్లి తాటకి. తండ్రి సునందుడు. పూర్వజన్మలో ఇతడు జితుడను వాడు, సనకనందనుల శాపం వలన మారీచుడుగా పుట్టాడు. రాక్షస జన్మకనుక మునులను వేధించు స్వభావం కలిగింది. మునులు చేయు యాగాలు, యజ్ఞాలు నాశనం చేస్తాడు. యజ్ఞగుండంలో రక్తపు కుండలు వేయడం, మాంసం ముద్దలు వేయడం చేస్తూ ఉంటాడు.

సీతాపహరణ సమయంలో రావణబ్రహ్మ మారీచుని సాయం అడిగాడు. శ్రీరామునితో వైరం వద్దన్నాడు మారీచుడు. తాను ఆ విషయంలో సాయం చెయ్యనన్నాడు. శ్రీరాముడు అవతారమూర్తి. మానవ మాత్రుడు కాడు. వారితో పోరు మంచిది కాదు అన్నాడు మారీచుడు.

రావణబ్రహ్మకు కోపం వచ్చింది. చెప్పినట్లు చెయ్యకపోతే చంపుతానన్నాడు. మారీచుడు ఆలోచించుకున్నాడు. నీవు చెప్పినట్లు చేస్తే శ్రీరాముడు చంపుతాడు. చేయకపోతే నీవు చంపుతావు. రావణుడి చేతిలో చచ్చేకంటే శ్రీరాముని చేతిలో చంపటం మేలు అనుకున్నాడు. రావణుడు చెప్పిన పనికి అంగీకరించాడు.





బంగారు లేడిగా మారాడు. సీతారాముల పర్ణశాల సమీపంలోకి వెళ్ళాడు. చెంగు చెంగున గంతులేస్తున్నాడు. సీత దృష్టిలో పడ్డాడు. సీత బంగారులేడిని శ్రీరామునికి చూపించింది. నాథా! అది నాకు కావాలి అంది సీత. భార్యమాటలకు వివేకం కోల్పోయాడు రాముడు. బంగారులేడి లోకంలో ఉందా ఏమిటీ మాయ అనుకోలేదు. ధరుర్భాణాలు తీసుకున్నాడు. బంగారులేడిని వెంబడించాడు.

మాయలేడి రూపంలోఉన్న మారీచుడు, అందకుండా పారిపోయాడు. వెంబడిం చాడు రాముడు. కొంత దూరం పోయాక రామ బాణానికి చిక్కి ప్రాణాలు కోల్పోయాడు. రామబాణం తగులగానే హా!లక్ష్మణా! అంటూ కేక పెట్టి చచ్చిపోయాడు. శ్రీరామ బాణం తగలడంతో శావవిమోచనం కలిగింది. పూర్వరూపం వచ్చింది. మారీచుని కోర్కె నెరవేరింది. అటు రావణ బ్రహ్మపై స్వామి భక్తి చూపించాడు. అంతే గాక సీతాపహరణకు మార్గం సుగమమైంది. మాయలేడి హా లక్ష్మణా!అనగానే శ్రీరామునికే ఆపద వచ్చిందనుకుంది సీత. లక్ష్మణుని వెళ్ళమంది. అన్న శ్రీరాముని శక్తిమీద నమ్మకమున్న లక్ష్మణుడు ఆ కేక నమ్మలేదు. కాని భర్తమీదనున్న గుడ్డి ప్రేమతో లక్ష్మణుని వెళ్ళమంది. ఒత్తిడి చేసింది. వెళ్లాడు. సీతాపహరణ జరిగింది.



మారీచుడు మాయలేడిగా మారటంవలన జన్మధన్యమైంది. రావణబ్రహ్మ సీతాపహరణ చేయగలిగాడు. సీతారాములకు ఒకరిపై ఒకరికి ఉన్న ప్రేమ వ్యక్తమవుతుంది. లక్ష్మణునికి అన్నపై విశ్వాసం, వదిన ఆజ్ఞ శిరసావహించటం తెలుస్తుంది. ఇందరి మనస్తత్వాలు వ్యక్తమవుతాయి మాయలేడి పాత్ర వలన.

# ౨౦ శూర్పణఖ

రావణబ్రహ్మ చెల్లెలు శూర్పణఖ. శూర్పముల వంటి గోళ్ళు కలది శూర్పణఖ అయింది. చాటలవంటి గోళ్ళు కలది. అంటే ఎంతో పెద్దగోళ్లు ఉన్నాయి ఈమెకు. ఈమె విద్యుజ్జిహ్వుని భార్య. శూర్పణఖ కుమారుడు జంబుకాసురుడు. ఇతడు తపశ్శక్తి సంపన్నుడు.

ఒకనాడు రావణుడు శూర్పణఖ భర్త విద్యుజ్జిహ్వుని యుద్ధానికి తీసుకువెడతాడు కాలకే యులతో యుద్ధం చేస్తు న్నారు. రావణుడు పొర పాటున శూర్పణఖ భర్తను హతమారుస్తాడు.

శూర్పణఖ సోదరులు ఖరుడు, దూషణుడు. భర్త చనిపోయిన తరువాత దండకారణ్యములో సోద రులచెంత ఉంటోంది. ఖరదూషణులు రావణుని పినతల్లి పిల్లలు.







సీతారామలక్ష్మణులు అరణ్య వాసం చేయడానికి దండకారణ్యం వచ్చారు. పర్ణశాల నిర్మించుకొని ఉంటున్నారు. సీతారాములకు పూలు, పండ్లు లక్ష్మణుడు తెచ్చి ఇస్తాడు. ఒకరోజు కత్తితో పండ్లను కొట్టాడు. ఆ పొదలో శూర్పణఖ కుమారుడు జంబుకాసురుడు తపస్సు చేసుకుంటున్నాడు. లక్ష్మణుడి కత్తి పొరపాటున జంబుకాసురునికి తగిలింది. జంబుకాసురుడు చచ్చిపోతాడు. ఆ విషయం తల్లి శూర్పణఖకు తెలిసింది. ఆమెకు ఎక్కడ లేని కోపం వచ్చింది. ఎవరురా? నా కుమారుని చంపింది? అనివెతక సాగింది. వెతుకుతూ పోగా సీతారాములు కనిపించారు. భర్తలేని శూర్పణఖకు శ్రీరాముని చూడగానే మోహం కలిగింది. కొడుకు చచ్చిపోయిన సంగతి మర్చిపోయింది. శ్రీరాముని దరికి చేరింది. తనను వరించమన్నది. "నాకు భార్యఉన్నది. అదిగో, అక్కడ ఒంటరిగా నా తమ్ముడు లక్ష్మణుడున్నాడు వెళ్ళు" అన్నాడు రాముడు. అయితే నీవు పంపినట్లు రాయి అని వీపు చూపింది. శూర్పణఖ వీపుమీద ముక్కు చెవులు కోయమని రాశాడు. శూర్పణఖ లక్ష్మణుని చెంతకు వెళ్ళింది. వరించమన్నది. వలదన్నాడు. ఇదిగో మీ అన్న చెప్పాడు చూడు అంటూ వీపు చూపింది. అయితే ఇటు తిరుగు అంటూ లక్ష్మణుడు కత్తి తీశాడు. శూర్పణఖ ముక్కూ, చెవులూ కోశాడు.

ఏడుస్తూ పెడబొబ్బలు పెట్టింది. రావణుని వద్దకు వెళ్ళింది. అన్నా! మాన వులచేత పరాభవం జరిగింది. ప్రతీకారం తీర్చుకో అంది. సీత అందాని వర్ణించి చెప్పి ంది. రావణునికి మోహం పుట్టేలా చేసింది. సీతను లంకకు తీసుకు రమ్మ న్నది. చెల్లి శూర్పణఖ మాటలకు రెచ్చిపోయాడు. సీతాపహరణం చేయ డానికి నిశ్చయించు కున్నాడు. సీతను అప హరించాడు. అశోక వనంలో తెచ్చిపెట్టాడు. శూర్పణఖ కక్ష ఈ రూపంలో తీర్చుకుంది.

# ౨౭ కుశుడు- లవుడు.

కుశుడు, లవుడు అన్నదమ్ములు. సీతారాముల సంతానం. ఇద్దరూ కవలపిల్లలు. గురుభక్తి, దైవభక్తి, మాతృభక్తి, కలవారు. ఏకసంథాగ్రాహులు, సమస్తవిద్యలూ నేర్చినవారు. రామరావణ యుద్ధం ముగిసింది. శ్రీరాముడు రావణుని వధించాడు. సీతను తీసుకొని అయోధ్యకు వస్తాడు. భరతుడు రాజ్యభారాన్ని శ్రీరామునకు అప్పగించాడు.

చాకలితిప్పడు శ్రీరాముని ఏదో అన్నాడని గూఢచారులు రామునికి చెపుతారు. లోకుల మాటకు తలవంచాడు రాముడు. సీతను అడవిలో వదలి రమ్మని లక్ష్మణునితో అంటాడు.



లక్ష్మణుడు సీతను అడవిలో వదలి వస్తాడు.

సీత గర్భవతి. అడవిలో ఒంటరిగా దుఃఖిస్తోంది సీత. వాల్మీకి మహర్షి చూశాడు. గర్భవతి అయిన స్త్రీ, ఆశ్రమానికి తీసుకు వెళ్ళాడు. ముని కన్యలు సపర్యలు చేశారు. వాల్మీకి సీత బాధలు తెలుసుకున్నాడు. వాల్మీకి ఆశ్రమంలో సీత కవలపిల్లలను ప్రసవిం చింది.

వాల్మీకి కుశలవులకు విద్యాబుద్ధులు నేర్పించాడు. అస్త్రశస్త్ర విద్యలు నేర్పించాడు. వాల్మీకి రామాయణం రాస్తున్నాడు. కుశలవులు రామాయణాన్ని గానం చేస్తున్నారు.

అయోధ్యలో శ్రీరామచంద్రుడు అశ్వమేధయాగం పూర్తి చేశాడు. యాగాశ్వాన్ని వదలిపెట్టారు. ఆ అశ్వాన్ని బంధించారు కుశలవులు. అశ్వం వెంట వచ్చిన వారిని దండించారు. లక్ష్మణుడు ఓడిపోతాడు.

శ్రీరామచంద్రుడే యాగాశ్వాన్ని విడిపించుకోవడానికి స్వయంగా వస్తాడు. కుశలవులతో యుద్ధం చేస్తాడు. పోరు పోటాపోటీగా సాగుతోంది. చిన్నపిల్లలు అయినా కుశలవులు శ్రీరాముని ఎదిరిస్తున్నారు. తండ్రిని మించిన కొడుకులు అనిపించుకున్నారు.

తండ్రీ కొడుకుల మధ్య యుద్ధం జరుగుతోంది. విషయం సీతకు తెలిసింది. పరుగు పరుగున వచ్చింది. యుద్ధాన్ని వారించింది. వాల్మీకి మహర్షి వచ్చాడు. శ్రీరామ చంద్రుడే

శ్రీరాముడు కొడుకులను చూసి పులకించిపోతాడు. కుశలవులను అయోధ్యకు తీసుకు వెడతాడు. ఒక శుభముహూర్తాన పిల్లలకు పట్టాభిషేకం చేసి రాజ్యభారం అప్పగిస్తాడు. కుశలవులు రాజ్యపాలన చేస్తారు.



# ౨౮ కుంభకర్ణుడు

కుంభకర్ణుడు రావణబ్రహ్మ సోదరుడు. విశ్రవసుకు కుమారుడు. కుంభకర్ణుని తల్లి కైకసి. తమ్ముడు విభీషణుడు. కుంభకర్ణుడు ఎంతో పెద్ద శరీరం కలవాడు. ఎంతో పెద్ద శరీరం. పుట్టగానే చిన్న చిన్న జంతువులను మింగబోయేవాడట. కుంభకర్ణుడు వరుసగా ఆరు నెలలు నిద్రపోతాడు. ఒక రోజు భోజనం చేస్తాడు.

కుంభకర్ణుడు మహాబలశాలి, శక్తిమంతుడు. ఎంత బలశాలి అంటే దేవేంద్రుడే భయపడినాడు. కుంభకర్ణుడు ఘోరమైన తపస్సు చేశాడు. అప్పుడే దేవేంద్రుడు భయపడినాడు. "మామూలుగానే



వీడిని వట్టలేము. ఇంకా తపశ్శక్తులు వస్తే లోకాలు అల్ల కల్లోలం అవుతాయి". అని దేవేంద్రుడు బ్రహ్మతో మొరా ఎట్టుకున్నాడు. వాడు సామాన్యుడు కాదే ఎలా? అన్నాడు బ్రహ్మ. మీరు ఏదో ఒకటి చేయాలి, లేకపోతే కష్టం అన్నాడు దేవేంద్రుడు. భారం బ్రహ్మపై పడింది. సరే అన్నాడు బ్రహ్మ. సృష్టికర్త కదా! ఏమైనా చేయగలడు. వాడి తపస్సుకు ప్రత్యక్షమౌతాను. వరం కోరుకోమంటాను. వాడు ఆరునెలలు నిద్ర ఒకరోజు భోజనం కోరుకునేలా వాడిచే పలికించు అని బ్రహ్మ సరస్వతిని ఆజ్ఞాపించాడు. సరస్వతి కుంభకర్ణుని నాలుకపై తిష్టవేసింది.

బ్రహ్మ ప్రత్యక్షమైనాడు. ఏం వరం కావాలో కోరుకోమన్నాడు. కుంభకర్ణుడు ఆరునెలలు నిద్ర, ఒకరోజు భోజనం అనుగ్రహించమన్నాడు. సరేనన్నాడు బ్రహ్మ. అప్పటినుండి కుంభకర్ణుడు ఆరునెలలు నిద్ర, ఒకరోజు భోజనం చేస్తాడు.

కుంభకర్ణుడు తామసి అయినా రావణబ్రహ్మను వారించాడు. రామునితో యుద్ధం వద్దన్నాడు. కుంభకర్ణుడు నిద్రపోవడానికి ప్రత్యేక భవనం కట్టించాడు రావణుడు.

కుంభకర్ణుడు బలిచక్రవర్తి మనుమరాలైన వజ్రజ్వాలను పెండ్లి చేసుకున్నాడు. వీరికి ఇద్దరు పిల్లలు. నికుంభుడు పెద్దకుమారుడు, కుంభుడు చిన్నకుమారుడు.

రామరావణ యుద్ధంలో కుంభకర్ణుడు మరణిస్తాడు.

## ౨౯ భక్త శబరి

శబరి ఒక బోయ కాంత. మహాభక్తురాలు. శ్రీరాముని కొరకై ఎదురు చూస్తూ ఉంది. శబరికి యోగ శక్తి కలదు. శ్రీరాముని కొరకై పంపానదీ తీరమందు ఎదురు చూస్తున్నది.

శ్రీరాముడు చిత్రకూటమునకు వచ్చాడన్న వార్త తెలిసింది. రోజూ రుచికరమైన పండ్లు కోస్తుంది. చెంగులో మూట కట్టు కుంటుంది. శ్రీరాముడు ఎప్పుడు వస్తాడా అని ఎదురుచూస్తోంది. అన్ని దిక్కులకు చూస్తుంది. రాకపోయేనరికి నిరుత్సా హపడుతుంది. కానీ, నిరాశచె ందదు. రేపు వస్తాడు నా రాముడు అని సంతృప్తి పడుతుంది. మరునటి రోజు కూడా ఇంతే. ఇలా ఎంతో కాలంగా ఎదురుచూస్తోంది. ఆకుల చప్పుడైతే అటు తిరుగుతుంది అదిగో నా రాముడు వస్తున్నాడు అనుకొని అటు చూస్తుంది. ఇటు చప్పుడైతే ఇటు చూస్తుంది. ఇటునుంచి వస్తున్నావా నాయనా! రామా! జాగ్రత్తగా రా నాయనా, అడవిలో రాళ్ల రప్పలు ఉంటాయి. అని హెచ్చరికలు జారీ చేస్తుంది. అంత మూఢ భక్తి కలది.



ఎదురు చూసిన రాముడు ఒకనాడు రానే వచ్చాడు. శ్రీరామ చంద్రుని చూసి రా నాయనా! నీ కోసమే ఈ ముసలి ప్రాణం ఎదురుచూస్తోంది. అని శ్రీరాముని ఆప్యాయంగా పలకరించింది. సపర్యలు చేసింది. తను ఏరికోరి తెచ్చిన పండ్లను కొరికి రుచిచూసి శ్రీరామునకు పెట్టింది. రుచిగా ఉన్నాయి తిను నాయనా అని, తియ్యగా ఉన్నాయి నాయనా!తిను అని పెట్టింది.

శ్రీరామచంద్రుడు శబరిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు. ఆలింగనం చేసుకున్నాడు. శబరిపెట్టిన ఎంగిలి పండ్లను తిన్నాడు. శబరి ఎదురుచూపులు ఫలించాయి. శబరి జన్మ ధన్యమైంది. శబరి పరమానందభరితురాలైంది.



## ౩౦ జటాయువు

జటాయువు పెద్ద పక్షి. ఆకాశంలో సూర్యమండలం దాకా ఎగురగలదు. అంత శక్తి సామర్థ్యాలున్నాయి జటాయువుకు.

జటాయువు సూర్యుని రథసారథి అనూరుని కుమారుడు. తల్లి శ్యేని. సంపాతి జటాయువుని సోదరుడు. దశరథుని ఆప్తమిత్రుడు జటాయువు. ఒకనాడు దశరథుడు సముద్ర ప్రమాదానికి గురియైనాడు. సముద్రంలో కొట్టుకొని పోతున్నాడు. అది జటాయువు చూశాడు. దశరథుని రక్షించి ఒడ్డుకు చేర్చాడు. అప్పటినుండి జటాయువు, దశరథుడు మంచి ఆప్త మిత్రులైనారు.

రావణుడు సీతను అపహరించాడు. ఆకాశమార్గంలో పోతున్నాడు. సీత పెద్దగా ఏడుస్తోంది. కాపాడండీ... కాపాడండీ అని అంటోంది. నేను జనకమహారాజు కూతుర్ని



కాపాడండీ అని కేకలు వేస్తోంది. అది విన్నాడు జటాయువు. అయ్యో! నా మిత్రుని కోడలు. ఆపదలోఉంది, కాపాడాలి అనుకున్నాడు. ఒక్క ఉదుటన పైకి ఎగిరాడు. రావణుని నమీపించాడు. సీతను వదిలిపెట్టు అన్నాడు. రావణుడు వినలేదు. రావణుడు మాటలతో వినేటట్లు లేడు అనుకున్నాడు. తన బలాన్ని చూపించాడు. ఘోరంగా ఎదురొడ్డి పోరాడాడు. వాడియైన గోళ్ళతో రక్కినాడు. వట్టుదల గల రావణుడు వెనుకంజ వేయలేదు. రావణుడు జటాయువు రెక్కలు నరికినాడు.



కుప్పకూలిపోయింది జటాయువు. రామా!... రామా!..అంటూ మూలుగుతూ పడివుంది. కొన ఊపిరితో ఉంది. సీత కోసం వెతు కుతూ రాము డు వచ్చాడు. రామా... రామా... అనే మూలుగు వినిపిం చింది. రాముడు అటకు వెళ్ళాడు. రెక్కలు తెగిన జటాయువు కనిపిం చింది. రావణుడు సీతను అపహరించాడని చెపు తుంది. రావణుడు లంకలో ఉ ంటాడని చెప్పి ప్రాణాలు వదిలింది జటా యువు.

శ్రీరాముడచ్చటనే జటాయువుకు దహన సంస్కారాలు చేశాడు. శ్రీరాముని చేతులమీదుగా దహన సంస్కారం చేయించుకునే భాగ్యం జటాయువుకు దక్కింది. జటాయువు జన్మధన్యమైంది.



# 31 విభీషణుడు

విశ్రవోబ్రహ్మ కుమారుదు విభీషణుడు. విశ్రవోబ్రహ్మకు, మాలినికి కలిగిన కుమారుడు విభీషణుడు. రావణ కుంభకర్ణులకు సోదరుడు. విశ్రవోబ్రహ్మకు "పాక" అను రాక్షస స్త్రీకి పుట్టినది శూర్పణఖ. శూర్పణఖ విభీషణుని చెల్లెలు. త్రిజట విభీషణుని కూతురు.

విభీషణుడు జ్ఞాని. వివేకవంతుడు. సదాచార సంపన్నుడు. రాక్షసులవలే దుర్మార్గుడు కాదు. హింస చేయడు. హింసను ప్రోత్సహించడు. రావణుడు చేయు చెడ్డ పనులకు సహకరించడు. చెడ్డపనులలో రావణునకు తోడు ఉండడు. ఎప్పటికప్పుడు రావణునకు తగిన సలహాలు, సూచనలు ఇస్తుంటాడు. రావణుడు చేసే దుర్మార్గపు పనులను ఖండిస్తూంటాడు.

రావణుడు సీతాపహరణ చేయ తలపెట్టాడు. రావణుడు సభను ఏర్పాటు చేశాడు. సీతాపహరణ విషయం చెప్పాడు. విభీషణుడు సభాముఖంగా ఖండించాడు. శ్రీరాముడు మానవమాత్రుడు కాదన్నాడు విభీషణుడు. విష్ణుఅంశ సంభూతుడు. అతనితో వైరం మంచిది కాదన్నాడు. సీతను చెరబట్టడం లంకకు ముప్పు అన్నాడు. అయినా రావణుడు వినలేదు. పెడచెవిన పెట్టాడు. విభీషణుని తూలనాడాడు రావణుడు. మనస్థాపం చెంది విభీషణుడు లంకను వదిలిపెట్టాడు.

శ్రీరాముని పక్షం చేరాడు. లంక గుట్టును రామునకు చెప్పాడు. రావణబ్రహ్మ కుమారుడు మేఘనాథుడు. రామలక్ష్మణులను యుద్ధంలో మూర్ఛిల్ల జేసినాడు. రామలక్ష్మణులను ఎదిరించుటకు అధిక శక్తికై యాగం చేస్తున్నాడు. ఆ యాగం పూర్తి అయితే మేఘనాథునికి ఓటమి లేదు. మేఘనాథుని యాగం పూర్తి కాకముందే వధించమని శ్రీరామునికి చెప్పి పంపాడు. రాముడు మేఘనాథుని జాడ తెలుసుకున్నాడు. వెళ్ళి వధించాడు.

అదే విధంగా రావణుడు ఎదురులేని శక్తి కలవాడు. రావణ బ్రహ్మ నాభిలో అమృతం ఉంది. నాభిని ఛేదిస్తేనే రావణుడు మరణిస్తాడు. ఆ విషయం విభీషణుడు రామునకు చెపుతాడు. శ్రీరాముడు బాణం సంధించి రావణుని నాభిని కొట్టాడు. రావణుడు కుప్ప కూలిపోయాడు. శ్రీరామచంద్రుడు రావణుని జయించుటకు విభీషణుడే కారకుడైనాడు.



రావణ వధ అనంతరం శ్రీరాముడు విభీషణుని లంకకు రాజుని చేశాడు. పట్టం కట్టాడు. బహుకాలం విభీషణుడు లంకను పాలించాడు.

# ౩౨ త్రిజట

త్రిజట విభీషణుని కూతురు. త్రిజట తల్లి 'సరమ' అను గంధర్వ స్త్రీ. త్రిజట సంస్కారవంతురాలు. గుణవతి. వినయవతి. మంచి మర్యాదలు తెలిసినది. రాక్షస స్త్రీలకు ఉండవలసిన లక్షణాలు త్రిజటలో లేవు. వివేకవంతురాలు.

రావణుడు సీతను అపహరించాడు. లంకకు తెచ్చాడు. అశోకవనంలో ఉంచాడు. సీత చుట్టూ కొందరు రాక్షస స్త్రీలకు కాపలా పెట్టాడు. వారిలో త్రిజట ముఖ్యమైనది.

త్రిజట సీతకు జరిగిన అన్యాయానికి బాధపడింది. సీతకు మనోధైర్యం చెప్పింది. కష్టాలు కలకాలం ఉండవు మంచి రోజులు వస్తాయి. అని ఊరడించింది. సీతకు కావలసిన సపర్యలు చేసింది. సీత యోగక్షేమాలు దగ్గరుండి చూసుకుంది.

ఒకనాడు త్రిజట కలగన్నది. ఆ కలలో జరిగిన వృత్తాంతం సీతకు చెప్పింది. శ్రీరామచంద్రుడు సీత జాడ తెలుసుకున్నాడు. వానరసైన్యంతో రావణునిపై దాడి చేశాడు. రామరావణ యుద్ధంలో రావణుడు మరణిస్తాడు. సీతను తీసుకునిపోయి అయోధ్యకు వెడతాడు. అని త్రిజట కలగన్నది. త్రిజట కల నిజమైంది.

రామాయణంలో త్రిజట వృత్తాంతం మనోహరమైంది. త్రిజట స్వప్నం చక్కని ఘట్టం. సీతను ఆనందపరచింది త్రిజట స్వప్న వృత్తాంతం.



# ౩౩ శాంత

శాంత దశరథమహారాజు కూతురు. రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు సోదరి. ఋష్యశృంగుని భార్య. మహాసాధ్వి.

దశరథుని మిత్రుడు రోమపాదుడు. రోమపాదునకు సంతానము లేదు. దశరథుడు శాంతను రోమపాదునకు దత్తత ఇచ్చాడు.

రోమపాదుడు అంగదేశమునకు రాజు. శాపవశమున ఇతనికి సంతాన భాగ్యము కలుగలేదు. మిత్రుడైన దశరథుని కూతురిని దత్తత తీసుకున్నాడు. అంగ దేశమున అనావృష్టి నెలకొన్నది. వర్షములు లేక పంటలు పండుటలేదు. ప్రజలు నానా బాధలు పడుతున్నారు. ప్రజల బాధలు తొలగించాలనుకున్నాడు రోమపాదుడు.

ఋష్యశృంగుడు మహా తపశ్శాలి. వేద వేదాంగ తత్పరుడు. ఋషి ఆశ్రమాలలో పెరిగి పెద్దవాడైనాడు. నాగరీక సమాజము తెలియదు. స్త్రీల ముఖము కూడా చూచి ఎరుగడు. ఋష్యశృంగుడు కాలు పెడితే అనావృష్టి పోతుందన ప్రతీతి.

రోమపాదుడు ఋష్యశృంగుని గురించి తెలుసుకున్నాడు. ఏవిధంగానైనా ఋష్యశృంగుని అంగదేశానికి రప్పించాలనుకున్నాడు. వైశాలి అను వేశ్య కాంతను ఋష్యశృంగుని వద్దకు రోమపాదుడు పంపాడు. ఆమె ఋష్యశృంగుని తమ ఆశ్రమానికి రమ్మని ఆహ్వానించింది. ఋష్యశృంగుడు వైశాలిని వింతగా చూశాడు. తనకు తెలియని మరోలోకం ఉంది అనుకున్నాడు. ఆమె వెంట నడిచాడు.

ఆమె ఋష్యశృంగుని అంగదేశం తీసుకు వచ్చింది. ఋష్యశృంగుడు అంగదేశం చేరుకున్నాడు. రోమపాదుని కోర్కెను మన్నించాడు. యజ్ఞయాగాలు చేశాడు. కుంభవృష్టి కురిసింది. ప్రజలు ఆనందించారు.

రోమపాదుడు తన కుమార్తె శాంతను ఋష్యశృంగునికిచ్చి వివాహం చేశాడు. ఋష్యశృంగునకు శాంతకు "జతురంగుడు" అను కుమారుడు పుట్టాడు. అంగదేశం సుభిక్షంగా ఉంది.

# 34 వాలి, సుగ్రీవులు

వాలి, సుగ్రీవులు అన్నదమ్ములు. వానర రాజులు. వాలి కిష్కింధకు రాజు, సుగ్రీవుడు ఋష్యమూక పర్వత ప్రాంత రాజు.

అహల్యకు ఇంద్రుని వలన వాలి, సూర్యుని వలన సుగ్రీవుడు పుట్టారు. గౌతమమహర్షి భార్య అహల్య. గౌతముడు లేని సమయంలో ఇంద్రుడు, సూర్యుడు కూడినారు. గౌతముడు వారు తన పిల్లలే అని అనుకుంటు న్నాడు.

ఒకనాడు గౌతముడు కుమారులను ఇద్దరిని భుజాన ఎత్తుకున్నాడు. కన్న కూతురు అంజన వెంట నడుస్తోంది. ముగ్గురను తీసుకుని సముద్రతీరాన షికారుకు వెళ్ళాడు. గౌతముని సొంతకూతురు అంజన. వాలి,సుగ్రీవులకంటే పెద్దది. అంజనకు వాలి, సుగ్రీవుల జనన విషయం తెలుసు. అందువలన ఆమెకు వారిపై ఈర్ష్యకలిగింది. గౌతముడు సొంతకూతురుని నడిపిస్తున్నాడు. కానివారిని ఎత్తుకున్నాడు. అనే సత్యాన్ని తండ్రితో అన్నది. గౌతమునకు కోపం వచ్చింది. వీరు నా కుమారులు కారా అని ఆశ్చర్యపోయాడు. వెంటనే సముద్రంలో పారవేశాడు. నాకుమారులు కాకపోతే వానరులైపోతారు అని అన్నాడు. అన్నట్లు గా వారికి వానరరూపం వచ్చింది. వారే వాలి, సుగ్రీవులు. ఈ విషయం అహల్యకు కూడా తెలిసింది. కోపగించుకుంది. కూతురు అంజనను శపించింది. నీకూ కపి సంతానమే కలుగు గాక అని శాపం పెట్టింది. అంజన కుమారుడే ఆంజనేయుడు.

'వాలి' బలసంపన్నుడు. ధైర్యశాలి. ఘోర తపస్సు చేశాడు. దైవ వరం పొందాడు. వాలిని ఎవరు ఎదిరిస్తే వారి బలం నగం వచ్చి వాలికి చేరుతుంది. అరదం వలన వాలిని ఎదిరించిన వారు ఓడిపోతారు.



'వాలి' కిష్కింధను పాలిస్తున్నాడు. వాలి భార్య తార. ఒకనాడు 'మాయావి' అను రాక్షసుడు వాలిని ఎదిరించాడు. ఇద్దరూ ముష్టియుద్ధం



చేస్తున్నారు. ఘోరంగాపోరు సాగుతోంది. ఇరువురికి రక్తం ధారలు కారుతోంది. పోరాటం చేసుకుంటూ ఇరువురూ ఒక బిలం లోకి వెళ్ళారు. తార, సుగ్రీవులు వెతుక్కుంటూ వాలికొరకు వచ్చారు. బిలం ముందు రక్తపు మడుగులు చూశారు. వాలి మరణించాడు అనుకున్నారు. వాలిని చంపి, మాయావి బిలంలో ఉన్నాడనుకున్నారు. మాయావి మరల బయటకు వస్తే, రాజ్యం అల్లకల్లోలం అవుతుందనుకున్నాడు సుగ్రీవుడు. మాయావి బయటకు రాకుండా పెద్ద బండను బిలానికి అడ్డంపెట్టాడు. తారతో తిరిగి వెళ్ళాడు. తారను భార్యగా చేసుకున్నాడు. కిష్కింధను పాలిస్తున్నాడు.

కొంతకాలానికి బిలంలో మాయావిని వాలి వధించాడు. బిలానికి అడ్డుగా ఉన్న రాయిని పడేశాడు. రాజ్యానికి వచ్చాడు. తారను భార్యగా చేసుకొని రాజ్యం కాజేశాడని వాలి తన్ని తరిమేశాడు సుగ్రీవుని. వాలి, సుగ్రీవుల వైరం పెరిగింది. తార వాలిని భర్తగా స్వీకరించింది.

సుగ్రీవుడు, వాలికి దూరంగా వెళ్ళిపోయాడు. ఋష్యమూక పర్వతానికి చేరుకున్నాడు. . అక్కడ సుగ్రీవుడు రాజ్యాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. జాంబవంతుడు, ఆంజనేయుడు సుగ్రీవుని కొలువులో మంత్రులుగా ఉన్నారు. అందరూ సంస్కారము గలవారే.

ఇట్లుండగా కొంతకాలానికి ఋష్యమూక పర్వతానికి రామలక్ష్మణులు వచ్చారు. వారిని చూసి సుగ్రీవుడు భయపడ్డాడు. విషయం తెలుసుకోమని హనుమంతుని పంపాడు. హనుమంతుడు శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళాడు. వారు వచ్చిన సంగతి తెలుసుకున్నాడు. ఈ ప్రాంతానికి రాజు సుగ్రీవుడని చెప్పాడు. సుగ్రీవుడు మీకు తగిన సహాయం చేస్తాడని చెప్పాడు. హనుమంతుడు సుగ్రీవుని వద్దకు వచ్చి శ్రీరాముని సంగతి చెప్పాడు. రామలక్ష్మణులను, సుగ్రీవుని మిత్రులను చేశాడు.

రామలక్ష్మణులతో స్నేహం కుదిరింది సుగ్రీవునకు. తనకు జరిగిన అన్యాయాన్ని, వాలి చేసిన ద్రోహాన్ని రామునకు చెప్పాడు సుగ్రీవుడు. యుద్ధంలో తగిన సహాయం చేస్తానన్నాడు. రాముని అండతో వాలిపై రెండు మూడు సార్లు పోరాడినాడు. సుగ్రీవునకు పరాభవం పొంది వెనుతిరిగినాడు. శ్రీరామునికి వాలిని ఎలా చంపాలోఅర్థం కావడంలేదు. ఒద్దరూ ఒకే పోలికలతో ఉన్నారు. రాముడు సహాయం చేయలేదని సుగ్రీవునకు కోపం వచ్చింది.

ఈ సారి సుగ్రీవుడు మెడలో పూలదండ వేసుకుని వెళ్ళాడు. వాలిని బయటకు రమ్మన్నాడు. తారకు అనుమానం వచ్చింది. యుద్ధానికి వద్దని వారించింది. అయినా వాలి వినలేదు. సుగ్రీవుని ఎదుర్కొన్నాడు. సుగ్రీవుని మెడలో పూలమాల ఉండడం చేత శ్రీరాముడు సుగ్రీవుని, వాలిని వేరువేరుగా గుర్తించాడు.

వాలి, సుగ్రీవులు హోరాహోరీగా పోరాటం చేస్తున్నారు. శ్రీరాముడు చెట్టు చాటున ఉన్నాడు. గురి చూసి వాలిపై బాణం వేశాడు. రామబాణానికి వాలి నేలకూలాడు.